సంస్థాపకులు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 20 | ఆగస్టు 1982 | సంచిక 7

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## విశాల

రచన

శ్రీమతి జి. భవానీ కృష్ణమూర్తి

జ్యోతి, పి. బి. నెం 1824, హైదరాబాదు-20

ముందు : 'రాముడు కాదు కృష్ణుడు' అక్కినేని...రాధిక  వెనుక : మంజుభార్గవి

కలర్ ట్రాన్స్పరెన్సీలు : శ్యామ్

# తొలిమాట

## నల్లని మబ్బులు..



పెరిగేధరల వడగాడ్పులకి మధ్యతరగతి ఆవిరై, మబ్బయి కన్నీటివర్షం కురుస్తోంది! పురోభివృద్ధి ఎందులోనైనా వుండాల్సిందే కదాని ధరల అభివృద్ధి జానేవుంది.....

వానాకాలం చదువులు అన్నట్టుగానే బళ్ళు బరబరా తెరిచారు. తీరిగ్గా కొత్త పాఠ్యపుస్తకాలు వస్తాయి-ఈలోగా వాటికోసం ఇప్పటి నుంచే క్యూల్లో కాపురాలు పెట్టకుండా నోట్సుపుస్తకాలూ అప్పీ సప్లయి చేస్తున్నారు- పిల్లలు ముందు గబగబా పరీక్షలు (ఎలాగో) రాసేసి పాసయితే చాలు. పుస్తకాలు పరీక్షలయ్యాకా వొస్తేనేం-అని 'పెద్దల' అభిప్రాయంమూ [illegible] - [illegible] వారం ఆగా పుస్తకాలు అవ్వే వస్తాయి-తొందరపడితే ఎలా!

డా. [illegible]

ప్రకృతి రహస్యం కనుగొనబడింది!




# మీ శరీర ఛాయను మెచ్చేలాగ పెంపొందిస్తుంది... సహజంగా, మృదువుగా.

ఫెయిర్ అండ్ లవ్లీ — విజ్ఞానం సాధించిన అద్భుతమైన పరిశోధన — నల్ల చర్మాన్ని ఎర్రబరిచే యీ క్రీమ్ రెండు విధాలుగా పనిచేస్తుంది.

**చర్మం లోపల:** ఫెయిర్ అండ్ లవ్లీలోని ప్రత్యేకమైన పదార్థం చర్మం లోపలనుంచి నల్లబరిచే ఆ ప్రక్రియను తగ్గిస్తూ, యితరులు మెచ్చేలాగ ఎర్రబరుస్తుంది

**చర్మం బయట:** ఫెయిర్ అండ్ లవ్లీలోని 'ఎండను పడదోసే' పదార్థాలు, ఎండలోని అల్ట్రావయొలెట్ కిరణాలను పడదోసి మీ చర్మం ఎండ వల్ల నల్లబడకుండా కాపాడతాయి – మీరైతే ఆ సూర్యకిరణాల్లోని ఆరోగ్యమంతటినీ పూర్తిగా పొందగలుగుతారు.

6 నెలల వాడకంతో, ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మాన్ని మీరెప్పుడూ కోరుకునేటంత ఎర్రగా రూపొందిస్తుంది.



**ఫెయిర్ అండ్ లవ్లీ — నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సునిశ్చితమైన తీరు**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS.FALOV.13.1810




మే నెల జ్యోతిలో ప్రారంభమైన 'పందెం', అద్భుతంగా, అమోఘంగా చక్కని శైలిలో ఆ కర్షణీయంగా వున్నది. శశిర ఋతువులో ఒక చీకటి రాత్రితో ప్రారంభించబడిన ఈ పందెం యింకా ఎంతైనా చదవాలనే కుతూహలము మాలో తహ తహ లాడు చున్నది. ఒక శకలం తర్వాత మరో దానిలా జూన్ జ్యోతిలో రెండవ భాగాన్ని కూడా ఆస్వాదించి ఆనందాన్ని పొందాను. శ్రీ కె. సదాశివరావుగార్కి నా హృదయ పూర్వక వందనాలు, అందించిన జ్యోతి సంపాదక వర్గానికి నా అభినందనలు.

రాంపావుని వీరన్న, శ్రీకాకుళం.

ప్రతి నెలా మీ జ్యోతి మాసపత్రిక చదువుతుంటాను, కాని యీ రోజు నేను చదివిన జూలై నెల జ్యోతిలో యెన్నో రోజుల నుంచి నాలో వున్న భావాల కనుగుణంగా వున్న కథ చదివి యెవరికీ వుత్తరము వ్రాయని నేను సంతోషము పట్టలేక మీకు అభినందనలు, రచయిత గౌరవర్ణులు దీపక్ కుమార్‌గార్కి నా అభినందనలు తెలియ చేయమని కోరుతున్నాను. విప్లవాత్మకంగా చాలా మంది రాస్తారు. ఆ రచయిత వ్రాసిన మ(ధ)ర్మం అద్భుతంగా వుంది. కాని మీరు ఆ కథను వేసి మాలాటి విప్లవం, నూతనత్వం కోరే పాఠకులకు పరమానందాన్ని పంచి పెట్టడం నాకు మహానందంగావుంది, మళ్ళీ! మళ్ళీ తిరిగి! మీకో శత సహస్ర అమూల్యమైన అభినందనలతో నో వుత్తేజ భరితమైన నా మనస్సు అర్పిస్తున్నాను, యిలాగే విప్లవాన్ని ఆదరించి ప్రోత్సాహించి మాకం దయ చేయమని కోరుతున్నాను

రాయసం వెంకటసుబ్రహ్మణ్యం,
హైదరాబాదు.

జూలై జ్యోతి ముఖచిత్రం, గెటప్, బాగుంది. ఈ నెల సంచిక కార్టున్స్ ప్రత్యేక సంచిక అన్పించింది. "కుడి ఎడమైతే" సుభాని కార్టూన్లు మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి. సీరియల్స్ రెండూ ఆసక్తిగానే కొనసాగుతున్నాయి. ప్రచురిస్తున్న మినీ కవితలు భావగర్భితంగా వున్నాయి. కథల్లో కెల్లా 'కుక్క+కోడి+పిల్లి = ఆడది' కథ వైవిధ్యంగా వుంది. టైటిల్ చూస్తే ఈనాడు సమాజంలో ఆడదంటే ఎందుకింత చులకననిపిస్తుందో అర్థమవుతుంది.

వై. హేమబిందు. ప్రియ.
(గోర్నకల్)



మొన్న 16 తారీకున హైదరాబాద్‌లో శ్రీ త్రిపురనేని గోపీచంద్ కుమారుడు, జ్యోతి మాసపత్రిక ఎడిటోరియల్ సభ్యుడు, రచయిత త్రిపురనేని రాంగోపాల్‌కి లక్ష్మికి వివాహం జరిగింది. శ్రీ ఇన్నయ్య సారథ్యంలో అనేకమంది రచయిత(త్రు)ల సమక్షంలో వివాహంవేడుకగా, ఘనంగా జరిగింది.

---

"జ్యోతి" ప్రచురించిన కథలలో "ఓర్పు" కథ ఆడవారిలో సంతోషము కలిగి వున్నప్పుడు, ఏదైనా అయిన పని అవలేదని అనేటప్పుడు సంతోషంగా వున్న ఆడవారిలో ఓర్పు అవసమని మాధవపెద్ది పుణ్యశీల ప్రసాద్‌గారు వ్రాసిన "ఓర్పు" చదివిన తర్వాత తెలిసింది. 'రైన్‌బో' మినీకథ మాకు చదువుతున్న కొద్దీ కడుపుబ్బేలా నవ్వు వస్తూవుంది.

నంది తారకేశ్వరరావు.
ఖరగపూరు

జూలై సంచికలో ప్రచురించిన "ఓర్పు" కథలోని శారదమ్మ మతి భ్రమణ కారణమైన సంకట పరిస్థితిని వయోను సారంగా వర్ణించడం శ్లాఘనీయం. "మ(ధ)ర్మం" కథలో బంధాల్ని తెగువతో తెంచుకొన్న "చంద్ర" ధైర్యానికీ, ఆకథా రచయితకీ నాజోహార్లు.

"కుడి ఎడమైతే" కార్టూన్లు నన్ను కడుపుబ్బ నవ్వించాయి. కార్టూనిస్ట్ "షేక్ సుభాని"గారికి నా ధన్యవాదాలు.

చామర్తి శ్రీనివాస గోపాలరావు

జూలై నవలాను బంధం పిలుస్తూ ఏకబిగిన చదివించే తీరులో రచన చేశారు రచయిత్రి. ప్రచురించిన మీకు ధన్యవాదాలు!

ఒక ప్రవాసాంధ్రుడు.

# అభినందనలు



ప్రేమల్లోనూ, అందమైన బాధలాంటి త్యాగాల్లోనూ, సైన్సు(?) మిష్టరీల్లోనూ పడి ఈదే పాఠకజనానికి మధ్యతరగతి గుండెచప్పుళ్ళనీ, ట్రంకు పెట్టెలాటి జీవితపు బరబరగరగరలనీ, గతితప్పిన పిచ్చి బతుకులనీ, నిజాల్నీ, విషాన్నీ కథాబద్ధంచేసి కథల్లానే లాయరు శ్రీ రావిశాస్త్రి- ఈ ఆరవయ్యేళ్ళ రాచ బంగారుకొండ నుంచీ బంగారు గాలులు, వడగాలి అగ్ని కణాలు, మధ్యతరగతి మంద భాగ్యహాసాలూ.. ..... ఎన్నో చేరాయి కథారూపంలో సాహితీ ప్రియులకి-ఆలాటి రావి 'శాస్త్రీయ' మైన రాచ 'కొండగుర్తు'కథల తాలూకు యజమాని శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి.

ఆయన కలం నుంచీ అక్షర కిరణాలు కథలుగా ప్రసరిస్తూ నిరంతరం సాగాలని జ్యోతి మాసపత్రిక ఆకాంక్షిస్తోంది.

రావిశాస్త్రిగారూ - మా శుభాకాంక్షలు అందుకోండి!

## కేసరి కుటీరంవారి గృహలక్ష్మి స్వర్ణ కంకణం

కేసరి కుటీరం వారి స్వర్ణకంకణాన్ని 1982 సంవత్సరానికి శ్రీమతి తురగా జానకీరాణిగారికి బహూకరించారు.

[illegible] వంటి కథలు, [illegible] లాంటి [illegible] కథలు జానకీరాణి రాసినందుకు [illegible] ఈ సన్మానం జరగడం [illegible] జానకిగారి రచనలు [illegible]. జ్యోతి మాసపత్రిక అభినందనలు తెలుపుతోంది.

## ప్రొఫెసర్ క్రిష్ణకి మరో డాక్టరేటు డిగ్రీ గౌరవం

ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యాల్లో ప్రముఖ రచయిత ప్రొఫెసర్ జి. ఆర్ క్రిష్ణకి మైసూర్ విశ్వవిద్యాలయం, ఇటీవలనే ఆంత్రపాలజీలో పిహెచ్.డి. డిగ్రీ ఇచ్చి గౌరవించింది. "మొగవీర జాలర్లలో సాంఘిక పరిణామం" అనే థీసిస్‌కి ఈ డిగ్రీ ఇవ్వటం జరిగింది.

శ్రీ గోగినేని రాధాక్రిష్ణమూర్తి గుంటూరు జిల్లాలో పుట్టి-పెరిగారు. ఎం. ఎ. ఎం ఎస్. డబ్ల్యు. DAMనే డిగ్రీలు తీసుకున్నారు. శ్రీ క్రిష్ణకి [illegible] బ్రిస్టల్ విద్యాసంస్థ యింతకుముందే పిహెచ్ డి. (అంతర్జాతీయ సంబంధాల్లో) డిగ్రీనిచ్చి గౌరవించింది టెక్సాస్ విశ్వవిద్యాలయం (యు.ఎస్.ఎ.) D. Lit డిగ్రీ ప్రదానం చేసింది. ప్రస్తుతం బెంగుళూర్‌లో Institute of manargement studies లో డైరెక్టర్‌గా వున్నారు.



ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ వారు ప్రతి సంవత్సరము నిర్వహించిన "విజయాప్రెస్" చిన్న పిల్లల పోటీలో నెగ్గిన బేబీ నళినిక ముఖ్యమంత్రి కిరీటం తొడుగుతున్నారు.

---

### హైదరాబాద్-మ్యూజిక్ అండ్ డాన్స్ కాలేజీ వారు...

అఖిల భారత సంగీత నృత్య పోటీలు జూలై ఆఖరివారంలో నిర్వహించటానికి నిర్ణయించారు.

కర్ణాటక సంగీతం:- గాత్రం-వీణ- సీనియర్స్ మరియు జూనియర్స్

భరతనాట్యం:- భరత నాట్యం- కూచిపూడి- (సీనియర్స్ మరియు జూనియర్స్) మరియు లలిత సంగీతం పోటీలు నిర్వహించుచున్నారు విజేతలకు నగదు బహుమతులు-షీల్డు ఇవ్వబడును. ఆకాశవాణి, టి.వి. అధికారులు మరియు సుప్రసిద్ధ కళాకారులు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించెదరు.

ఈ ఉత్సవం ఆగస్టు నెలలో జరుగుతుంది ఈ ఉత్సవంలో శ్రీ నటరాజ రామకృష్ణ, శ్రీ ఎమ్. బాలమురళీకృష్ణ, శ్రీమతి జమున, మరియు శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నం గారలను సన్మానించుటకు కాలేజీ కమిటీ నిర్ణయించింది

వివరాలకు;-

యండమూరి సత్యనారాయణ
(ఆకాశవాణి అడ్వైజరు)
డైరెక్టర్, జనరల్-సెక్రటరీ,
లలిత మ్యూజిక్ అండ్ డాన్సు కాలేజీ
(గవర్నమెంట్ రిజిష్టర్డు)
8-49, వనస్థలిపురం,
హైదరాబాదు - 500 061.

అనే చిరునామాకు రు. 5/-లు మనియార్డరు చేసిన వారికి ప్రాస్పెక్టస్ మరియు అప్లికేషన్ పంపబడును.

### కవితలకు ఆహ్వానం

'అవగాహన' ఆధునిక ఆలోచనా పిటక అయిదవసంపుటి, కవితా ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. రచయితలు తమ రచనలు ఈ దిగువ చిరునామాకు పంపాలి. పూనేపల్లి సత్యనారాయణ,

ఎడిటర్ - అవగాహన
(బుక్స్ అండ్ బుక్స్ ప్రచురణ)
బొండాడ వీధి
విజయనగరం 531201





# క్రోక్విల్

# కార్టూన్ సమావేశం



ఆరోజు అంటే ఈమధ్యే ఓ ఆదివారం ఆరోతారీకు

స్థలం సిటీ సెంట్రల్ లైబ్రరీ హైదరాబాద్

సమయం ఎ చకండా పది గంటలకె ఉదయం

స్పష్టం పైన చెప్పిన సమావేశం



శ్రీ సత్యం బహుమతి ప్రదానం చేశారు. మొదటి బహుమతి గ్రహీత
మూడవబహుమతి గ్రహీత శ్రీ రమేశ్ (వాపీ) వరస లేకుండా

డియర్ నరి,

మీటింగు.... వుంహోరం ఆరంభమయ్యాయి. ఇటు వేదికమీద శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు (ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులు) అధ్యక్ష స్థానంలో; ముఖ్య అతిధి, బహుమతి ప్రదాతగా శ్రీ సత్యం; వక్తలుగా శ్రీ రాంభట్ల కృష్ణ మూర్తి, జ్యోతి మాసపత్రిక సంపాదకురాలు శ్రీమతి వి. లీలావతి రాఘవయ్యగారు, శ్రీ యండమూరి వీరేంద్రనాథ్, శ్రీ 'శంకు'....అటు ప్రేక్షకులలో అసంఖ్యాక కార్టూన్ ఇష్టులూ, కార్టూనిష్టులూ....ఎంత విట్‌కు అంత హాస్యంలా చేరారు.... సరదా, హాయి....హాస్యం గురించి, కార్టూన్ చిత్రణ గురించి, రచనా విధానం గురించి శ్రీ రాంభట్ల, శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీ యండమూరి, శ్రీ శంకు, ప్రసంగించారు.మరికొన్ని వివరాలు....



శ్రీ సుభాషి, శ్రీ కాటూరి, రెండవ బహుమతి గ్రహీత శ్రీ స్వర్ణ,
చివరకు మరో రెండవ బహుమతి గ్రహీత శ్రీ జయబాబు....సైజుకొద్ది వరస....



శ్రీమతి లీలావతి రాఘవయ్యగారు తమ ప్రసంగంతో జ్యోతి ప్రారంభంనుంచీ
సున్నితమైన హాస్యాన్ని అందిస్తున్నదనీ ఇకపై అలాగే
కొనసాగుతుందనీ వివరించారు



వేదిక మీద శ్రీ రాంభట్ల  శ్రీమతి లీలావతీ రాఘవయ్య  శ్రీ పొత్తూరి  శ్రీ సత్యం



కార్టూన్ పోటీలో ద్వితీయ బహుమతి పొందిన విడి కార్టూన్.

## ప రి చ య ం

1972 లో కార్టూనిస్టుగా ఆంధ్రజ్యోతి వార పత్రికలో పుట్టాను. తెలుగులో దాదాపు అన్ని మాస, వార పత్రికల పాఠకులను నా కార్టూన్లతో ఆంధ్ర భూమిలో కార్టూన్ కథలతో నవ్వించ ప్రయత్నించాను. ఆంధ్రభూమిలో వచ్చిన "జుఖేరి" కార్టూను కథ చూసి అభినందిస్తూ జయదేవ్ రాసిన లేఖకి కొంచెం గర్వపడ్డాను. ఇప్పుడు "జ్యోతి" వారు హాస్యోదరులు బాపు రమణల న్యాయనిర్ణయంలో బహుమతిచ్చి ఉత్సాహాన్ని, భయాన్ని కల్గిస్తున్నారు. "జ్యోతి" వారికి కృతజ్ఞతలు.

జ య బా బు



## జ్యోతి-భాగ్యలక్ష్మి లాటరీ కథ-పోటీలలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ




తు ్లయి

కొం‹ డల్ని కర్పూరం౧ చేసి ప్రకృతి నీరాజనాలిస్తోంది

త్యాగరాజస్వామి, శ్యా మ శా స్త్రి ముత్తుస్వామి దీక్షితార్లు త్రిమూర్తుల్లా ఆమె పెదవిమీద కూర్చుని అపూర్వ గీతా॰ కి తాళం వేస్తున్నారు

ఫెళ్ళున ఎగిరాఓి న ఉప్పెనని ఆమె ‹ టుగ న ాంగే౧ి ఆ పింగడంలో

ఆమె నోట్లోంచి అగ్నిపర్వతాలు తుంప ర్లుగా దొర్లుతున్నాయి

సముద్రంలోంచి రేగిన బడబాగ్ని తో అవి హో రా హో రీ పోటాడ

ఒక బిందువు పెదవి అంచున మువ్వలా వేళ్లాడుతోంది-అందులో క్షేత్రయ్య!

ఆమె పలువరసగా అన్నమాచార్యాది వాగ్గేయకారులందరూ ధవళ కాంతితో మెరిసిపోతున్నారు....

వెన్నెల తుఫాను!....

సుడిగాలికెగిరే చిత్తుకాగితాల్లా నక్షత్రాలు పిచ్చిగా తిరుగుతున్నాయి. ఆ వెన్నెల తుఫానులో మంటలు....వెన్నెల ఎర్రగా మారింది. ఆ ఎరుపు ఆర్ద్ర నక్షత్రాన్ని సవాలు చేస్తున్నట్టుంది. ఆ మంట 'తాన్‌సేన్' దీపిక రాగం! ఆ అతి ఉష్ణతకి కొద్దిసేపట్లో చంద్రుడు నల్లబడతాడేమోనని అనుమానం!...మళ్ళీ ఆ ఎరుపు మంట క్రమంగా తగ్గుతుంది... అమృతాన్ని వర్షిస్తున్నారెవరో!....అవును అది తాన్‌సేన్ భార్య ఆలపిస్తున్న అమృత వర్షిణి రాగం!

మంచుకొండలు ఆమె నోట్లోకి పరుగు పరుగున వచ్చి కరిగిపోతున్నాయి.

ఆమె పలుకులు నడుస్తూంటే, కాళ్ళకి వీణతీగెలు అడ్డు తగిలి శ్రవణానందకరమైన ధ్వని ఝుమ్మని....

ఆమె నాలుక ఫిడేలు....పై పెదవి కమాను....

సంగీత వాయిద్యాలన్నీ ప్రతిబింబించే ఓ స్త్రీమూర్తి ప్రత్యక్షమైంది. ఉన్న రాగాలన్నీ, ఆమె కట్టుకున్న చీరపై బుటాల్లా ఇమిడి ఉన్నాయి. ప్రత్యక్షమైన ఆ మూర్తి ఈమె కంఠాన్ని తన చేతుల్లోకి తీసుకుని సుధాధారతో కడిగి మళ్ళీ యథాస్థానంలో ఉంచి అదృశ్యమైంది.

ఈమె చుట్టూ చూసింది-పశువులు, శిశువులు, పాములు తనకిచ్చేరి ఆరంభం కోసం ఎదురు చూస్తున్నాయి ఆసక్తిగా. ఈమె గొంతు సవరించుకుని పాటబోయింది....

ఆశ్చర్యం!

తన గొంతుని ఎవరో బలవంతంగా లాగేసుకుని ఆ స్వరార్ణవం తమ స్వార్జితమన్న అహంకారంతో ఆలాపన సాగిస్తున్నారు....

........

........తక్కున మేల్కొంది పాప. కిటికీగుండా చూసింది. ఎదురింటి అరుగుమీద జానకి-ఉదయరవిచంద్రిక రాగాన్ని ఆలపిస్తూ!

పాప కళ్లు ఎర్రబడుతున్నాయి. రెప్ప వాల్చకుండా తదేకంగా ఎదురింటికేసి చూడసాగింది. ఆ అరుగుమీద కూర్చుని సాధన చేస్తున్న జానకి పాప కంటి పాపల్లో నిలిచిపోయింది.

### రచయిత పరిచయం

పేరు : వా. సు. అసలు

వాయువేగుల సుబ్రహ్మణ్యం

అప్పుడప్పుడు కథల్రాయాలని కోరిక-ఎపుడేనా రాస్తే, ఎప్పుడో ఓ మాటు పత్రికలకి పంపితే, ఎప్పటికో ఓ కథ పడ్డం-అలా....

కథంటే కథకాదు - ఆలోచనా శకలం అని నమ్ముతాను. నూటికో ఇంటిలెక్చ్యువల్స్ అన్నా, చీప్ టేస్ట్ అన్నా పరమ అసహ్యం....

"సుబ్రహ్మణ్యేన రక్షితోహం
అష్టాదశలోచన ఖండేన.........అనే
పల్లవి నందుకుంది జానకి.

పాడుతున్నప్పుడు, తాళంలో జానకి
వేసే ప్రతిదెబ్బా పాప వన్నుమీద కొరడాతో కొడుతున్నట్టు ఛళ్ళుమంటూంది.

ఇద్దరిలోను ఏకాగ్రత ఉంది-జానకి ఏకాగ్రత పాటమీద, పాప ఏకాగ్రత జానకిమీద!

పాటలో పారవశ్యాన్ని జానకి, హృదయంలో ఉద్వేగాన్ని పాప అనుభ
విస్తున్నారు

పాప కళ్ళు ఎర్రబడ్డాయి.

జానకి నోట్లోంచి వచ్చే ప్రతిపదమూ

---



కార్టూన్ పోటీలో ద్వితీయ బహుమతి పొందిన ఒకే అంశంపై వచ్చిన కార్టూన్‌లు : "నటుడే నాయకుడైతే".

## ప రి చ యం

1953 లో జన్మించి, కార్టూనిస్ట్ "శ్రీ కాటూరి" గారు గురువుగా, 1981 "ఆంధ్రజ్యోతి" వీక్లీ ఉగాది సంచికలో ప్రచురించిన కార్టూనతో నా కార్టూన్ జీవితం ప్రారంభించబడింది. వివిధ పత్రికలలో ప్రచురింప బడుటయేకాక, విజయవాడ కార్టూనిస్ట్‌లు నిర్వహించిన తృతీయ కార్టూన్ పోటీలో "ద్వితీయ" బహుమతి అందుకున్న నా పూర్తిపేరు "స్వర్ణ లక్ష్మీకాంత మోహన్." ప్రస్తుతం చీరాల "సుధా నర్సింగ్ హోమ్‌లో" మెడికల్ లాబ్ టెక్నీషియన్‌గా పని చేస్తున్నాను. ఇప్పుడు మళ్ళీ "ద్వితీయ" బహుమతి నిచ్చి ప్రోత్సహిస్తున్న "జ్యోతి" సంపాదకవర్గానికి నా హృదయ పూర్వక అభినందనములు.

— స్వర్ణ
[S. L. K. మోహన్



పాప కళ్ళల్లోంచి ఒకొక్క నీటిబొట్టుని రాల్చింది.

పాలరాతిమీద ప్రవహించే నీరులా సాగిపోతూంది జానకి పాట - మండుటెండలో ఇసుక తుఫాను కెదురీదుతున్నట్టుంది పాప హృదయం. జానకి పాట రమ్యమైన స్థాయిలో ఉంది-పాప ఉద్రేకం అతి తారాస్థాయిలో ఊగుతోంది.




పాప చూపులు సరిగ్గా జానకి పెదవుల మీదనే ఉన్నాయి. బాగా ఎర్రబడ్డ ఆ కళ్ళల్లోంచి బొటబొటా రాలుతున్న కన్నీరు వెచ్చగా కాకుండా వేడిగా ఉంది

ఉల్లాసం-ఉద్రేకం.......

ఆనందం—అవమానం........

తన్మయం—తామసం........

మోదం—ఖేదం........

సాధన—అసూయ.......

జానకి—పాప!

తారాస్థాయి నుండి షడ్జమంలో కొచ్చి పాట ఆపింది జానకి....

ఫెడీమని పాపనెవరో కొట్టారు ఉలిక్కిపడి చూసింది పాప.

“ఏమే మూగి ముండా! నిలబడే నిద్ర పోతున్నావ్! పో! ఆ పెరట్లోకి పోయి అంట్లు తోము” అంటూ వీపున మరో టేసింది తల్లి. సమాధానం చెప్ప (లేక) కుండా అమితంగా ఊగిపోతున్న గుండెతో పెరట్లోకెళ్ళింది పాప.

“ఈ ఇంటికి పీకలా దాపురించావు కదుటే. చచ్చినా బావుండును” అంటూ సాధించ నారంభించింది తల్లి నవనీతం.

పాపకి పేరులేదు. నవనీతం, ఆమె భర్త ఇద్దరూ కూడా ఉద్యోగస్తులే. ఫాల్స్ ప్రిస్టేజికి నిర్వచనం ఎవరికైనా కావలసొస్తే వీళ్ళని చూపిస్తే చాలు. ఇద్దరికిద్దరూ నూటో ఇంటలెక్చ్యుయల్స్! వాళ్ళుద్దేశంలో తమకెప్పుడూ జబ్బు

చేయకూడదు-చేసినా వాళ్ళ అస్వస్థత ఎవరికీ తెలీకూడదు. వాళ్ళు చెట్టాపట్టా లేసుకుని బయటకెళ్తే, వాళ్ళతో బాటు ఎవరూ రాకూడదు-వచ్చినా- రోడ్డున వెళ్ళే వాళ్ళందరూ తమతో వచ్చే వారిని చూసి ముగ్ధులయేంత అందంగానో హుందాగానో ఉండాలి ఆ కంపేనియన్. అలా అందరూ వాళ్ళ పక్కనున్న (పిల్ల, మేక, కుక్క.....ఏదైనా సరే) పదా




ర్థాన్ని చూసి మురిసిపోతూంటే, మేమే ఆ శాల్తీకి ఓనర్ల మంటూ కల్తీలేని డాంబికాన్ని ప్రదర్శించి అమితానందం చెందే స్వభావం వారిది.

వాళ్ళకి పెళ్ళయిన ఏడాది లోపునే పాప ఈ లోకానికి రవాణా అయింది. మరీ ఫేరెక్స్ బేబీ అంత అందంగానూ ఆరోగ్యంగానూ ఉండకపోయినా, పాప అందంగానే ఉండేది. పాప పుట్టడంతో వాళ్ళ ఆనందం చాలా రకాలుగా భంగ పడింది. నవనీతం ఆఫీసుకి సెలవ పెట్టా ల్సొచ్చింది ఓ నాలుగునెలలపాటు. బిడ్డకి పాలివ్వడం మన నవనీతానికి నామోషీ. ఆకలేసినప్పుడు పాప గోలపెట్టి ఏడ్చేది-వినుక్కుంటూ పాలు కలపటాని కుపక్ర మించేది తల్లికినిద్రాభంగం కలిగినందుకు తండ్రి మూర్తి శివమెత్తినటు చిందులేసి ఆ పనికందును కొట్టిననందర్భాలుకూడా లేకపోలేదు. ఆ వీధి చివర వెలసిన 'శిశు మందిర్' వీళ్ళ కష్టాల్ని కొంతవరకూ తీర్చింది- నవనీతానికి మళ్ళీ ఆఫీసుకెళ్ళే అవకాశాన్ని కలిగించిందికూడాను .అలా పగలంతా ఆ శిశు మందిరంలోను, రాత్రంతా ఈ పశుమందిరంలోనూ పెరగ నారంభించింపాప. పాపకి అప్పుడప్పుడే మాటలొస్తున్న రోజులవి. ఆ వచ్చీరాని మాటలువినడానికి తీరిక, విని ఆనందించ డానికి తీయనిమనస్సు లేదా తలిదండ్రు లకి. మాట్లాడాలనిపి-చినప్పుడల్లా ఎవరు

కనిపిస్తే వారితో ముద్దుముద్దుగా మాట్లాడేసేది పాప నిర్మొహమాటంగా. అలాంటి రోజుల్లో ఒకనాటి రాత్రి మూర్తి చిత్తుగా తాగేసి ఇంటికొచ్చాడు. నవనీతం అతన్ని కసురుకోలేదు. "భోంచేస్తారా" అని అడిగింది తలుపేస్తూ.

"నా కాకలిగాలేదు" అన్నాడు మూర్తి బట్టలు మార్చుకుంటూ.

అతనికి మరో ఆకలి జాస్తిగావుంది.




అందుకనే నవనీతాన్ని ఎత్తుకుని మంచం దగ్గరకు వచ్చాడు. ఆ మంచంమీద పడుకున్న పాపని చూసి విసుక్కుని మరో గదిలోకి దారి తీసాడు. ఇవతలిగదిలో ఏదో శబ్దమయింది–దాన్ని వాళ్ళు అట్టే పట్టించుకోలేదు.

నిద్దట్లో మంచంమీదనుంచి దొర్లి కింద పడింది పాప. ఆ పడ్డంలో మెడమీద గట్టిగా దెబ్బతగిలింది. ఆ దెబ్బతో ఆ పాప మూగదైంది. ఆనాటినుంచి రోజు రోజుకీ బలహీనంగా మారసాగింది. 'ఈ మూగిముండ మా కూతురని నలుగురితోనూ ఎలా చెప్పుకోమూ?' అనే ఆలోచన వాళ్ళ మెదళ్ళని దొలిచెయ్యసాగింది 'ఈ అమ్మాయి కిక మాటరాదు' అన్న డాక్టరు తీర్పు విన్నాక. దానికి తోడు పాపకి నాలుగేళ్ళొచ్చేసరికి వాళ్ళకో అబ్బాయి పుట్టాడు. ఆ కుర్రాడు ఎర్రగా బుర్రగా పీఘ్యాహలకు తగ్గట్టుండడంతో పాప మరీ పనికిమాలిందైంది వాళ్ళ దృష్టిలో.

ఇప్పుడు పాపది పదకొండేళ్ళ వయసు. మూగది. అందులోనూ ఎప్పుడూ నలుగురిలోకి రాలేదు. అందుకే అమాయకంగా (దాన్నే వాళ్ళు ఎడ్డి, మడ్డి....అంటూంటారు) ఉంటుంది. పాప ఆ ఇంట్లో పనిమనిషి కూడా కాదు. అంతకన్నా తక్కువే పాపా అని నోరారా పిలవడానికి వాళ్ళకి మనసు లేదు. అమ్మా అని అనడానికి పాపకి నోరులేదు.

పిళ్ళింటి ఎదురుగా ఉండే జానకి వాళ్ళిల్లు ఓ సంగీత నిలయం ఆ ఇంట్లోని వారందరికీ సంగీతంలో ప్రవేశమో ప్రావీణ్యతో ఉంది. వాళ్లెప్పుడూ సంగీతం గురించి సంగీతకారుల గురించి మాట్లాడుతూంటారు-అది పాప కిటికీ దగ్గర నిలబడి కుతూహలంగా వింటూ ఉంటుంది. జానకి, పాప ఒకే ఈడువారవడంవల్లనేమో జానకి పాడుతుంటే పాటలో తెలిసి ఆవేశం పొంగొస్తూంటుంది.




రాత్రి పదయింది.

ఇంటి పనంతా ముగించి పడుకుందామని లోనికొస్తున్న పాప కాలు తమ్ముడి చేతికి తగిలింది. అంతే! వాడు కెవ్వున కేక పెట్టి ఏడ్చాడు. కాదు-అరిచాడు-లేవక అనుస్తున్నట్టు ఏడ్చాడు. నవనీతానికి ఒళ్ళంతా అంటుకున్నట్టయి కుర్రాడ్ని ఊరుకోబెట్ట(లేక)డానిగ్గాను పాపని చావబాదింది. "దిక్కుమాలిన ముండ! ఫో అవతలకి. రారా బాబు మనం రేపు పొద్దున్నే చెరువుకి వెళ్దాంగా. అందుకని నువ్వు బజ్జోరా-నా బంగారు కొండే" అంటూ బంతిలాంటి కుర్రాడ్ని బుజాన్నేసుకుని ముద్దున్న తట్టి లేపుతూ "అలారం మూడింటికి పెట్టారా? మూడింటికి లేస్తేనే గాని ఐదింటికి వెళ్ళికెళ్ళలేం"

"పెట్టాలేవోయ్! పడుకో నిద్రొస్తూంది" అంటూ ముసుగు తన్నాడా పతిదేవుడు.

పాపకి నిద్రలేదు. దుఃఖం కడుపుని తరిగేస్తూంది. తన బాధ వినడానికి మనుషులు లేరు. చెప్పుకోడానికి నోరు లేదు. ఆవయసుకి ఆలోచించే అదృష్టము, అర్హత రెండూ లేవు చాలా రాత్రిళ్ళు ఈ రాత్రిలాగే గడిచాయి పాపకి. నిద్ర రాదు. కన్నీరు ఆగదు.

అలారం మ్రోగింది.

నవనీతం మంచంమీదనుంచే పాపని లేపి పన్లు పురమాయించనారంభించింది.

అనేక విధాలుగా హడావుడి, హైరానా పడి ఎలాగైతేనేం నాలుగున్నరకి మొగుడ్ని పిల్లాడ్ని వెంటబెట్టుకుని పెళ్ళికని బయలుదేరింది

వాళ్ళు వెళ్ళాక దీనంగా చాపమీద ఒరిగింది పాప.

నిద్ర రావడం లేదు-

తెలతెలవారుతూండగా చల్లటిగాలి పాప ముఖాన్ని వెక్కిరిస్తూపోయింది.

పాపకి. ఎంత వద్దనుకున్నా తన తల్లి ఏవగింపు, జానకి తల్లి ఆప్యాయతలే ఒకటి తరువాతొకటి కనిపించసాగాయి పాపకి.

జానకి ఆలపన పాపఊహలకి అడ్డు తగిలింది.

భైరవి రాగంలో త్యాగరాజ స్వామి కృతి అందుకుంది జానకి.

“ఉపచారము చేసే వారున్నారని




దిగ్గునలేచి కూర్చుంది ఏదో అదృశ్య హస్తం తన కడుపులోని పేగుల్ని బలవంతంగా పెరికివేస్తున్నట్టనిపించింది కిటికీలోంచి బయటికి చూసింది—

అరుగుమీద జానకి! సంగీతసాధనకు ఉపక్రమించనున్నది.

గుమ్మంలో కూర్చున్న జానకి తల్లి కూతురుకేసి తృప్తిగాచూసి “మా బంగారు కొండే” అన్నట్టు తలపై మెటికలువిరిచి లోనికెళ్ళింది. “ఛీ మూగిముండా” అంటూ తలపై మొట్టిన తన తల్లి గుర్తొచ్చింది

మరువకురా.......

క్షణక్షణానికి పాపకళ్ళు ఎర్రబడుతున్నాయి. హృదయం విప్పిగా ఊగుతూంది, రక్తం కుతకుతా ఉడుకుతుంది.

“..........కృపకావలెనని”

నేని కీర్తిని పలుకుచుండగ.....

పాపలో ఒళ్ళుతెలియని ఆవేశం-

పాటలో అవధుల్లేని ఉద్వేగం-

హిస్టరికల్‌గా బయటికొచ్చింది పాప-

భైరవి రాగానికున్న సహజమైన ఊపుని ఒలకబోస్తోంది జానకి. పాప

రెండు కళ్ళూ టపటపమని నీటి ధారల్ని కురిపిస్తున్నాయి

"........వాకిటనే పడిలముగా
వాతాత్మజుకున్నాడని ...."

క్రోధంతో కళ్ళేకాక ముఖమూ ఎర్రబడింది పాపకి.

పాటలోని రమ్యతని, అనుభూతిని చవిచూస్తోంది జానకి.

ఓ అలను తరుముకొస్తున్న అలను తరుముకొస్తున్న మరో అల(ల)........ పరంపరలా, దుఃఖం, క్రోధం, అసూయ బాధ ఒకదాన్నొకటి తరుముకొస్తున్నాయి పాపలో.

నిప్పుల తుఫానులో నిలబడ్డట్టుంది.

పాప చూపుల ధాటి తట్టుకోలేకనేమో జానకి పెదవులంత ఎర్రగా ఉన్నాయి!

జానకి పాటలోని పదధ్వని, పాప గుండె లోతుల్లోకి బలంగా ఈటెల్లా తాకుతున్నాయి.

"............ఏకాంతమునను
జానకి, ఏర్పడియే యున్నాదని.."

క్షణక్షణానికి జానకి పాపల మధ్య దూరం దగ్గరవుతూంది.

విలపించే పెదవులు పలకరించేకన్నులు ఎదురైతే ఎదురుబెదురు చిరునామా గల్లంతేగా మరి!

లేనిమాటకున్న చూపుకీ, లేని చూపుకున్న మాటకీ మధ్యనున్న దూరం కొలుస్తానని క్షితిజరేఖ వస్తే అది సబబేనా?

"నా బంగారు కొండే" జానకి తల్లి

"ఛీ మూగిముండా" తన తల్లి......

వద్దనుకున్నా అదే మళ్ళీ .. మళ్ళీ అదే... మళ్ళీ మళ్ళీ అదే ...అదే అదే....మళ్ళీ మళ్ళీ....

"....ఏకాంతమునను జానకి...."

చరిత్ర చరమగీతానికి పల్లవి రాయలేని అవతారమూర్తి అసాధ్య జననంలా నేలకొరిగింది అంతకుముందు వరకూ పాడుతున్న జానకి. ఉచ్చులా జానకి మెడచుట్టూ ఉన్న తన చేతుల్ని, ఇక ఇది పాడలేదన్న విశ్వాసం పూర్తిగా కలిగాక, ఇవతలికి లాగి యుగయుగాల బానిసత్వపు పంజరం ఊచల్ని కొరికి బయటికొచ్చి స్వేచ్ఛగా గగన గవాక్షాన్నధిగమిస్తున్న విహంగంలా, వెర్రిగా, తెల్లగా, ఏరులా, పిచ్చిగా, గట్టిగా.... నవ్వుకుంది పాప....తనలోనే. ★

**అంకితం**

తీవిగా ఇన్నేళ్ళు నడిచి ఈమధ్యే నిద్రించిన సింహం – మా నాన్నగారికి
ప్రేమతో...

వా. సు.

# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు^డబ్బు

( జరిగిన కథ )

ఫ్యాక్టరీ దరిదాపు పూర్తి కావొచ్చింది – ఈలోగా కూలివాళ్ళ నియామకంలో సమస్యలు, ఉద్యోగావకాశాలో ప్రాంతీయత మొదలయినవి అడ్డంతిరిగి పేచీలు పెడుతున్నాయి గాంధీ విద్యార్థులు కేపిటలిజానికీ కమ్యూనిజానికీ తేడా తెలీని ప్రకారు సమస్యలనిదాటి నిలబడ్డారు. ఇంతలో లాంగ్ డిస్టెన్స్ కాల్ . హారిక 'పార్టీలో హనమంతరావు సంగతి' బయట పెట్టింది-వెంటనే లక్ష్మికి తన నిర్ణయాలు మార్చుకోవలసిన పరిస్థితి వచ్చింది. రాత్రికి టాటావాలాకి షాక్ - నిజాన్ని లక్ష్మి విప్పింది. గాంధీ మరో బాణం కోసం చీకట్లో వెదుకుతున్నాడు....కంటపీరు -

---

—ఇక చదవండి—

"మా వెనుక ఇంత కథ జరిగిందా" అన్నాడు టాటావాలా నమ్మశక్యం కానట్టు.

లక్ష్మి మాట్లాడలేదు.

"మేం అప్పిచ్చిన ఫ్యాక్టరీ విద్యార్థిది కాదన్నమాట! దీని వెనుక వున్నది గాంధీ అన్నమాట మమ్మల్ని మోసం చెయ్యటానికి గాంధీతో కూడా ఒక అప్లికేషను పెట్టించి- దాన్ని మాతో నొక్కి పెట్టించి నాటకం ఆడేరన్నమాట. మా బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌లో ఒకరిగా వుంటూ మమ్మల్ని మోసం చేసేవన్న మాట...." టాటావాలా ఆవేశంతో వణికిపోతున్నాడు. తెల్లవారుతూనే వచ్చి లక్ష్మి చెప్పిన ఈ వార్త ఆయన లోని రక్త ప్రసరణాన్ని రెట్టింపు చేసింది.

లక్ష్మి నెమ్మదిగా తలెత్తింది. "మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు. మిమ్మల్ని మోసం చేద్దామని నా కెప్పుడూలేదు. ఈ గొడవంతా గాంధీకి రామ్మోహన రావుకీ మధ్య జరిగింది. రామ్మోహనరావ్‌కి మీరెంతో, గాంధీకి నేనూ అంతే! ఈ విషయం మీరెందుకు గుర్తించరు?"

అంతలో ఆమె కంఠం మారిపోయింది.

"....రెండు పొట్టేళ్ళు కుమ్ములాడుకుంటూంటే మధ్య ఆ కుందేలు నలిగిపోయి నట్టు వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుంటూ మిమ్మల్నీ నన్నూ మధ్యలో పావులుగా వుపయో గించుకుంటున్నారు. ఈ విషయం మీరెందుకు గుర్తించరు?"

టాటావాలా ఆలోచనలో పడ్డాడు.

ఆమె చెప్పింది నిజమే అనిపించింది. టి. ఎఫ్. టి. కంపెనీ పెట్టి గాంధీమీద పెద్ద ఎత్తులో దెబ్బ తీద్దామనుకున్నారు రామ్మోహనరావు. దానిమీద లక్షలు ఖర్చ య్యాయి. తనకి వచ్చిందేమీ లేదు,

ఇంతలో లక్ష్మి అన్నది-' ఇదే ఆలోచించాను రాత్రంతా. ఒక్కసారిగా నాకేదో అర్థమయినట్టయింది వాళ్ళిద్దరి మధ్యలో ఇక నేను వుండదల్చుకోలేదు.

నటుడే-నాయకుడైతే




బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల పదవికి కూడా రాజీనామా ఇచ్చేద్దామనుకుంటున్నాను. ఇంత మానసిక వ్యధ నాకెందుకో తెలుసా టాటాసాబ్. కేవలం మీకోసం_"

టాటావాలా ఉలిక్కిపడ్డాడు. ఆమె కొనసాగించింది.

"నేను మీకు ఎన్నైనా అబద్ధాలు చెప్పి వుండవచ్చు. కానీ నాకెవరూ లేరని చెప్పింది నిజం. అలాటి పరిస్థితుల్లో నాకు ఆప్యాయంగా సలహాలు ఇచ్చేరు మీరు....మిమల్ని మోసం చెయ్యటం తప్పనిపించింది. నన్ను నమ్ముకున్న గాంధీకి నేను ద్రోహం చేస్తున్నానని తెలుసు. అయినా అది నా ఆత్మక్షోభ కన్నా ఎక్కువ కాదు మీరు నన్ను నమ్మితే అది చాలు."

"ఇది....ఇదంతా రామ్మోహనరావుకి చెబ్దామా" అన్నాడు టాటావాలా. ఏడ్చినట్టుంది అనుకుంది మనసులో. పైకి మాత్రం "మీ ఇష్టం" అంది. టాటావాలా ఫోన్ దగ్గరకి లేచాడు. ఈ ముసలాడు నిజంగా చెప్పేటట్టు వున్నాడనుకుని "ఒక్క విషయం" అంది.

టాటావాలా ఆగేడు.

"చెబ్తే ఏం లాభం" అంది. "....ఆయన ఇంకేదో ప్లాన్ వేస్తారు, మనల్ని మళ్ళీ పావులుగా వాడుకుంటారు ..."

టాటావాలాకి ఏం చెయ్యాలో తోచలేదు.

ఇక్కడో విషయం గమనించాలి.

చౌకబారు తెలుగు సినిమాల్లో విలన్ పక్కనుండే కామెడీ విలన్‌లాటివాడు కాడు టాటావాలా! అతడో పెద్ద బ్యాంకు డైరెక్టర్. ఎన్నో పెద్దపెద్ద పరిశ్రమలలో భాగస్వామి. అతడికీ రామ్మోహనరావుకీ వున్న సంబంధం ఈనాటిదికాదు. ఒకరిమీద ఒకరు ఆధారపడి బ్రతికే పేరసైటు లాటి స్నేహమే కావొచ్చు తన వునికికి నష్టం

వస్తుందనిపిస్తే తప్ప పేగ సైటు తన పేరెంటు వృత్తాన్ని వదిలిపోదు. అతడికి లక్ష్మి అంటే సాఫ్ట్ కార్నర్ వుండొచ్చుగాక! లక్ష్మిపట్ల ఆకర్షితుడు అయివుండొచ్చుగాక!! కానీ ఈ క్షణం ఓ అమ్మాయొచ్చి కొద్దిగా కళ్ళనీళ్ళు పెట్టగానే కరిగిపోయి-తిరిగి పోవటానికి ముందు చెప్పినట్టు కామెడీ విలన్ కాడు.

అతడు ఆలోచిస్తున్నాడు. లక్ష్మి చెప్పిన మొత్తం ఆర్గ్యుమెంట్‌లో అతడికి నచ్చిన ఒకే పాయింటు-రామ్మోహనరావు వరంగల్ దగ్గర బినామీ ఫ్యాక్టరీపెట్టించి, కేవలం గాంధీని మోసంచెయ్యటంకోసం తనచేత లక్ష ఖర్చుపెట్టించటం. మామూలు పరిస్థితుల్లో అయితే దాని గురించి అంత పట్టించుకోక పోయేవాడు.

ఇప్పుడు గాంధీ చాపక్రింద నీరులా షక్కీ తమ బ్యాంకులో ప్రవేశించాడన్న విషయం అతడిని మండిపడేటట్టు చేస్తూంది. అందుకే ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు.

లక్ష్మి తక్కువదేమీకాదు. అతడిని గమనిస్తూనేవుంది. తనని అతడు పూర్తిగా నమ్మటంలేదని తెలుస్తూనే వుంది. వీలైతే ఒక చిలక కొట్టుడు కొద్దామను కుంటున్నాడే తప్ప-కాన్ఫిడెన్స్‌లోకి తీసుకోవటంలేదు.

తీసుకోడని తెలుసు ఆమెకి.

డబ్బుతో పుట్టి డబ్బుతో పెరిగినవాడు - ఒక సీసా మందుకొట్టించి బికినీతో డాన్స్‌చేసేస్తే ఆ మత్తులో రహస్యాలు చెప్పెయ్యటం కేవలం సినిమాల్లోనే సాధ్యం.

ఆమె తన ఆఖరి అస్త్రాన్ని వుపయోగించింది.

తనతోపాటు తెచ్చిన కవర్‌ని అతడి ముందుకు తోసింది.

"ఏమిటి" అనుమానంగా అడిగాడు టాటావాలా.

"శివకైలాస్ బ్యాంకు షేర్లు...." తాపీగా అంది లక్ష్మి. "నేనొక నిర్ణయాని కొచ్చాను టాటాసాబ్ ఇంత చెప్పినా మీరు నన్ను నమ్మటంలేదు. కారణం నాకు తెలీదు. నిజానికి మిమ్మల్ని ఇంతలా కన్విన్స్ చెయ్యవలసిన అవసరంకూడా లేదు. కానీ నీకు చెప్పానుగా మీరంటే అదోవిధమైన గౌరవమూ, అభిమానమూ అని. అందుకే ఈ షేర్లు మీకిచ్చేసి, ఈ చదరంగం ఆటనుంచి నేను తప్పుకుందామని అనుకుంటున్నాను. నేను షేరు ఒకటికీ నలభైకి కొన్నాను. అదేధర ఇచ్చేసి, నన్ను విముక్తురాల్ని చెయ్యండి.

టాటావాలా నమ్మలేనట్టు చూసేడు.

షేరు ఒకటికి నలభై రూపాయల చొప్పున....

అతడో క్షణం ఆలోచించాడు!

ఇందులో ఏదైనా మోసం వుందా-

ఈసారి ''తను'' ఏదైనా బుట్టలో పడబోతున్నాడా?

ఏం చెయ్యాలో తోచలేదు.

"ఒక్క క్షణం" అని చెప్పి లోపలికి వెళ్ళాడు. కొంచంసేపు తటపటా




యించి రామ్మోహనరావుకి ఫోన్ చేసేడు.

"హల్లో" అట్నుంచి వినిపించింది.

"నేనూ-టాటావాలాని"-"ఏంటాటా"? రామ్మోహనరావు అడిగాడు.

"లక్ష్మి వచ్చింది"

"ఇంత ప్రొద్దున్నేనా? ఏమిటట?"

"బ్యాంకుషేర్లు అన్నీ అమ్మేస్తుందట"

ఆవార్త వినగానే ఫోన్‌మీద రామ్మోహనరావు చెయ్యి బిగుసుకుంది. అయితే ఎందుకింత హఠాత్తుగా ఆమె అమ్మేస్తుంది అని అతడు ఆలోచించలేదు క్రితంరోజు రాత్రి తనూ హనుమంతరావూ మాట్లాడుకోవటాన్ని హారిక చూసి, ఎక్కడో అడవిలో వున్న గాంధీకి ఫోన్ చేసి చెబుతుందనీ, గాంధీ ఆ రాత్రికి రాత్రే మళ్ళీ లక్ష్మికి ఈ విషయం చెబుతాడనీ, అందుకే లక్ష్మి ప్రొద్దున్నే టాటావాలా దగ్గరకి వచ్చిందనీ, అతడు వూహించలేకపోయాడు.

రామ్మోహనరావుకి టాటావాలా కూడా గాంధీ నుంచి లక్ష్మి విడిపోవాలనుకున్న సంగతీ-తనకూ లక్ష్మికీ వున్న దగ్గరతనం సంగతీ- చెప్పలేదు. కేవలం షేర్లు కొనుక్కోవాలా అక్కర్లేదా అని అడిగాడు.

రామ్మోహనరావు క్షణం పాటు ఆలోచించాడు.

ఈ షేర్లు కొనాలంటే లక్ష్మికీ గాంధీకీ నాలుగు లక్షలు ఇవ్వాలి. వాళ్లు యాభై లక్షలు సంపాదించే పందెం ఓడిపోతారు. అది వేరేసంగతి. ఈ నాలుగు లక్షలు మాత్రం ఎందుకివ్వాలి? పందెం ఓడిపోయిన తర్వాత కూడా వాళ్లు జీవితాంతం ఎందుకు హాయిగా బ్రతకాలి? రామ్మోహనరావు పెదవులమీద నవ్వు వెలిసింది.

లక్ష్మి తమ బ్యాంకులోనే డైరెక్టర్‌గా వుంటే కళ్ళనీళ్ళ పర్యంతం ఏడిపించ

పచ్చు. ఆమె పేరుకి డైరెక్టర్‌గా మిగిలుంది. కానీ చేతులో డబ్బుండదు. గాంధీ శ్లేష్మంలో పడ్డ ఈగలా కొట్టుకుంటాడు డబ్బులేక....

క్షణంలో ఇదంతా ఆలోచించి "కొనొద్దు" అన్నాడు టాటావాలాతో. "అంతేకాదు మనవాళ్లు ఎవరూ కొనకుండా చూడండి." అని ఫోన్ పెట్టేసేడు.

టాటావాలా కూడా ఫోన్ పెట్టేసి ముందు రూమ్‌లోకి వచ్చాడు ఎవ్వి షాక్ తగిలిన వాడిలా నిలబడిపోయాడు.

గదిలో లక్ష్మిలేదు. చిన్న చీటీ మాత్రం వుంది-

"మీ మీద నమ్మకంతో వచ్చి మీ కన్నీ చెబ్తే-మీరు తిరిగి రామ్మోహనరావ్‌కి సంహా కోసం ఫోన్ చెయ్యటం దారుణం! మీరు కావాలనుకుంటే మీకు షేర్లన్నీ బహుమతిగా ఇచ్చేసి వుండేదాన్ని టాటాసాబ్! కానీ నా అభిమానాన్ని మీరు శంకించారు....గుడ్‌బై!"

ం ం ం ం ం

సాయంత్రం అయిదయింది.

సభా కార్యక్రమాలు మొదలవటానికి ఇంకా రెండు గంటల సమయముంది. కేంద్ర ఆర్థికమంత్రి సుబార్తో చౌదరీ, రాష్ట్ర ముఖ్యమంత్రీ అక్కడ వుండటంతో మొత్తం రాష్ట్రపు రాజకీయ నాయకులంతా అక్కడకు చేరుకున్నారు. అదవిమధ్యలో పాలిటిక్స్ విడుదచేశాయి.

గాంధీ ఒక నిర్ణయానికి వచ్చేసేడు.

ఎలాగూ రామ్మోహనరావుకి లక్ష్మిసంగతి తెలిసిపోయింది. ఇక చాలా కొద్ది కాలంలో తన సంగతికూడా తెలిసిపోతుంది. అంతవరకూ ఆగటంఎందుకు. ఎలగు చచ్చిపోతున్నప్పుడు కనీసం ప్రత్యర్థి కాలైనా విరగొట్టి చావటం మంచిది.

అతడీ నిర్ణయానికి వచ్చేసాక చురుగ్గా ఆ ఫంక్షన్ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు.

ఆరవుతూ వుండగా నరానరి తమ వూరునించి కార్లో విచ్చేసిన రామ్మోహనరావు మీటింగ్ స్థంభందగ్గర కారుదిగాడు. సభాస్థలి వేదికదగ్గరున్న గాంధీ అతడిని చూడగానే వేదిక పక్కకు తప్పుకున్నాడు. అలా తప్పుకుంటూ వుండగా కార్లోంచి దిగుతూ హారిక కనిపించింది.

అతడు అచేతనుడయ్యాడు.

గుండ్రటి మొహం, గులాబీరంగుచీరె, అమాయకమైన కళ్ళలో తొణికిసలాడే విజ్ఞానం, తెల్లటి శరీరం-

ఆమెనిచూస్తూ అక్కడ ప్రకృతే ఒక క్షణం స్థంభించిపోయినట్టుంది.

విద్యార్థి ఎదురెళ్ళి వాళ్ళని ఆహ్వానించాడు.

మరో గంటలో సభా కార్యక్రమాలు మొదలయ్యాయి.

ఆహ్వానితుల్ని వేదికపైదకు పిలుస్తూ ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రితో బాటు




రామ్మోహనరావ్‌ని కూడా ఆహ్వానించాడు విద్యార్థి. రామ్మోహనరావు సంతోషించాడు. కేంద్ర ఆర్థిక మంత్రి పక్కన కూర్చోవటం అంత సామాన్యమైన విషయమేమీ కాదు.

ముఖ్యమంత్రి మాట్లాడుతూ పరిశ్రమలే దేశానికి వెన్నెముకలనీ-మరిన్ని పరిశ్రమలు ఆంధ్రదేశంలో రావాలనీ అన్నారు. కేంద్ర ఆర్థిక మంత్రి మాట్లాడుతూ, ఇలా బ్యాక్‌వర్డ్ ప్రాంతాలలో పరిశ్రమలు వస్తే రీజనల్ బ్యాలెన్సింగ్ వుంటుందన్నారు. తరువాత రామ్మోహన్‌రావువంతు వచ్చింది. వచ్చే బడ్జెట్‌లో పెట్టుబడిదారుడికి టాక్సు రాయితీలు ఇవ్వకపోతే దేశంలో పారిశ్రామికీకరణం దెబ్బతింటుందని హెచ్చరించాడు.

తరువాత విద్యార్థి మైకుముందు నిల్చున్నాడు. అతడు వందన సమర్పణ చేస్తాడని అందరూ అనుకున్నారు. కానీ అతడన్నాడు.

"ఈ పరిశ్రమనాది. దీనిలో షేర్లు చాలావరకూ నా పేరుమీదే వున్నాయి. కానీ ఈ పరిశ్రమకి మూలస్థంభం అయిన మరో వ్యక్తిని ఇప్పుడు మీకు పరిచయం చెయ్యబోతున్నాను రోడ్డుమీద అనామకంగా తిరుగుతున్న నన్ను తనతోపాటు తీసుకువెళ్ళి, పేపరు పరిశ్రమలో నాకున్న అనుభవాన్ని గుర్తించి-అన్నిటికన్నా ముఖ్యంగా నన్ను నమ్మి ఈ పరిశ్రమ నాతో పెట్టించిన ఆ వ్యక్తిని వేదిక మీదకు రమ్మని-మాట్లాడమనీ ఆహ్వానిస్తున్నాను".

జనం అంతా ఆ వ్యక్తి ఎవరా అని చూడసాగేరు. గాంధీ సీట్లోంచి లేచి నెమ్మదిగా వేదిక వైపు రాసాగేడు.

పక్కకి వంగి ముఖ్యమంత్రితో మాట్లాడుతున్న రామ్మోహనరావు ముందు అతడిని గమనించలేదు. మెట్లెక్కుతూ వుండగా చూసేడు.

రక్తం అంతా మొహంలోకి చిమ్మినట్టూ-ఎత్తైన సముద్రకెరటం ఒక్కసారి వచ్చి మొహం మీద కొట్టినట్టూ అతడు స్తబ్దుడై నిర్వీణ్ణుడయ్యాడు-

గాంధీ తాపీగా మెట్లెక్కసాగేడు.

ముందు వరుసలో కూర్చున్న హారిక మోచేతిమీద ముందుకి వంగింది.

గాంధీ డయాస్ మీద కూర్చున్న రామ్మోహనరావ్ వైపు చూసేడు. అతడు తన వైపే చూడటం గమనించి పలకరింపుగా నవ్వేడు. రామ్మోహనరావ్ నవ్వలేదు. అతడు ఇంకా షాక్ నుంచి తేరుకోలేదు. జి.టి ఎఫ్ కంపెనీ గాంధీది!!! ఆ సత్యాన్ని అతడింకా జీర్ణించుకోలేక పోతున్నాడు. అతడి మొహం పాలిపోయి వుంది.

గాంధీకి తెలుసు తన గెలుపు తాత్కాలికమని!

ఇంకో అయిదు నిముషాల్లో ఈ షాక్‌నుంచి రామ్మోహనరావ్ తేరుకుంటాడు. తరువాత తన నెలా దెబ్బకొట్టాలా అని ఆలోచిస్తాడు. అంతిమ విజయం అతడిదే... తన ఈ విజయం చాలా తాత్కాలికం. నీకు తెలియకుండా ఒక కంపెనీ పెట్టి నీనుంచే డబ్బు సంపాదించేం, అని చెప్పుకోవటానికి మాత్రం ఈ విజయం పని చేస్తుంది.

అతడు మైకు ఎదురుగా నిలబడ్డాడు.

ముందు సీట్లో హారిక కూర్చొని- కళ్ళూ కళ్ళు కలుసుకోగానే నవ్వింది. నెమ్మదిగా అతడి ముందున్న ప్రేక్షకులు అదృశ్యమయ్యారు. లైట్ల కవతల వున్న చీకటి మాత్రం కనిపిస్తూంది.

అతడు మాట్లాడటం ప్రారంభించాడు. అది ఒక ప్రవాహంలా మొదట నెమ్మదిగా, తరువాత జలపాతంలా ఉద్వేగంగా సాగింది.

అది తన జీవితపు ఆఖరి వుపన్యాసమూ-అన్నట్టు అతడు మాట్లాడసాగాడు. మరణానికి ముందు రణ రంగంలో వీరుడు తోటి సైనికుల్ని ఆయత్తపర్చడంకోసం సాగించిన ఉపన్యాసంలా వుందది.

తన తల్లి మరణానికి డబ్బు సంపాదన-న్యాయ సహితానికీ న్యాయరహితానికీ తేడా - చిన్న ఎత్తులో నుంచి ఎదగటానికి ప్రయత్నించటం-పడితే తగిలిన దెబ్బలు- అక్కణ్ణుంచి ప్రారంభించి ఈనాడు ఈ ఎత్తుకి ఎదగటం-అంతా చెప్పాడు. పందెం గురించి చెప్పలేదు. అతడు చెప్పదల్చుకున్నది ఒకటే. ఈనాటి యువకుల్లో కృషి కన్నా-వ్యవస్థపట్ల కోపమూ నిస్పృహా ఎక్కువ అవుతున్నాయని. ఏమాత్రం కొద్దిగా తెలివి తేటలున్నా, కొద్ది కృషి చేసినా ఈవ్యవస్థ ఇచ్చేటంత ప్రోత్సాహం కాపిటలిజం కానీ, కమ్యూనిజం గానీ ఇవ్వదు. ఈ విషయాన్ని గుర్తించకుండా యువకులు సంఘాలూ-వర్గాలూ స్థాపించటంలోనూ-ఆస్తులు తగల బెట్టటంలోనూ నిమగ్నమై వున్నారు. రాజకీయాలు కలుషితమై వున్నాయి నిజమే. కానీ యువత అంతకన్నా ఎక్కువ కలుషితమై వుంది. దీన్ని ఎవరూ గుర్తించటం లేదు నిజమైన కృషికి గుర్తింపు ఎప్పుడూ వుంటుంది.

అదే అతడు చెప్పినది.

అతడి సుదీర్ఘమైన ఉపన్యాసం పూర్తి అయింది. ఎవరూ చప్పట్లు కూడా కొట్టలేదు. సభికులు అతడి ఉపన్యాస సారాంశాన్ని జీర్ణించుకోలేక పోయారు. ఎవరూ చెప్పని కొత్త థియరీ అది. దానికి గుర్తింపు లభిస్తుంది అని అతడు అనుకోలేదు కూడా. ఉపన్యాసం పూర్తికాగానే వేదిక దిగి చీకట్లో కలిసిపోయేడు.

అతడి ఉపన్యాసంలోని నిజాయితీని అర్థం చేసుకున్నది ఇద్దరే!

ఒకరు హారిక!

రెండవవారు రామ్మోహనరావు, విద్యార్థి- వీళ్ళెవరూ గాదు.

కేంద్ర ఆర్థిక మంత్రి సుకార్తో చౌదరి!

ఆయన కూడా ఒక పేద కుటుంబంలో పుట్టి స్వశక్తిమీద పైకి వచ్చిన వాడు.

ఆ రాత్రి ఆయన గాంధీకి ఒక వార్త పంపించాడు-తెల్లవారే తనతో కలిసి "బర్డ్-వాచింగ్"కి రమ్మని బర్డ్‌వాచింగ్ ఒక హాబీ పక్షుల్ని గమనించటం.. దాని మీద నోట్సు వ్రాసుకోవటం-వాటిని సరిగ్గా గుర్తించటం....

ఆహాబీ ఆయనకి వుండబట్టే-ఆరోజున ఆరాత్రి అడవిలో విడిదికి వచ్చి వున్నాడు.

ఉపన్యాసం పూర్తయ్యాక గాంధీ ఆ జనంనుంచీ-వెలుతురు నుంచీ విడివడి దూరంగా వెళ్ళిపోయాడు-చీకట్లో ఒంటరిగా కూర్చున్నాడు. అడవి మధ్యలో వెలుగుతున్న లైట్లని చూస్తూ ఉంటే అదంతా తన కృషేనా అన్న అనుమానం కలుగుతోంది. ఇంకొంత కాలానికి ఈ అడవి తిరిగి అంధకార బంధురమవుతుంది.

ఇద్దరు వ్యక్తులు వ్యక్తిగత కక్షలవల్ల వేసుకునే చదరంగపు ఎత్తుల్లో కొన్ని వందల మందికి ఉద్యోగాన్నిచ్చిన ఈ ఫ్యాక్టరీ మూతపడుతుంది.

రాత్రి ఎంత సేపయిందో తెలీదు.

అడవిలోంచి జంతువుల వింత వింత అరుపులు వినబడటం ప్రారంభం అయింది. అతడు లేచి తన కాటేజీ వైపు రాసాగేడు.

ఊరి పొలిమేర్లలోకి ప్రవేశిస్తూంటే నలుగురైదుగురు కోయస్త్రీలు కుంకుమ పెట్టి పోయిన రాతి విగ్రహం కనబడింది రావిచెట్టు క్రింద. శివుడి లింగం ఆకారంలో వున్న ఆరాతిని కోయలు భక్తితో పూజిస్తారు. నాగరికత ఇప్పుడిప్పుడే నెమ్మదిగా అక్కడివరకూ పాకుతూంది.

అతడా విగ్రహం ముందు మోకాళ్ళమీద కూర్చున్నాడు. "ప్రభూ-నన్ని విపత్కర పరిస్థితినుంచి రక్షించు. రక్షిస్తే నీకు గుడి కట్టిస్తాను" అని ప్రార్థించాడు. మనసు తేలికైంది. దేముడు తనవైపున్నాడన్న భావం ధైర్యాన్నిచ్చింది.

అంతలో సన్నటి నవ్వు వినిపిస్తే పక్కకి తిరిగి చూసేడు

లక్ష్మి!




"ఎందుకు నవ్వుతున్నావ్?" అని అడిగాడు.

"దేముడి ఆశ్రయంలో నువ్వు ధైర్యాన్ని పొందటానికి చేసే ప్రయత్నం చూసి" అంది. గాంధీ "నేను ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

ఆమె మళ్ళీ నవ్వింది. "గతంలో ఇంతకన్నా పెద్దదెబ్బలు తగిలాయి నీకు. అయినా నువ్వు స్వశక్తినే నమ్ముకున్నావు. ఇప్పుడు డబ్బు ఎక్కువ అవుతున్నకొద్దీ నీమీద నీకు నమ్మకం పోయి, దేముడి నీడలో ఆశ్రయం పొందడానికి ప్రయత్నిస్తున్నావు. నూరుపాళ్ళ కాపిటలిస్టులా దేముడికి గుడికూడా కట్టిస్తున్నావు. డబ్బుకీ దైవచింతనకీ ఇంత దగ్గర సంబంధం వుంటుందనుకోలేదుస్మీ.... వర్లేదులే గాంధీ! ఈ గుడి కూడా నీ పేరు తరతరాలుగా నిలవటానికే సాయం చేస్తుంది. ఇదీ ఒకరకం పెట్టుబడే. బిర్లా కట్టించిన వెంకటేశ్వరుని గుడిని 'బిర్లామందిర్' అని ఎలాఅంటారో శివుని ఆలయాన్నికూడా నీపేరుమీద 'గాంధీ టెంపుల్' అంటార్లే."

అతడు చప్పున చుట్టూ చూసేడు. లక్ష్మిలేదు. అంతా తన భ్రమ అతడికి నవ్వొచ్చింది. తన మనస్సులో కాంట్రడిక్షనే లక్ష్మా?

అతడు తన కాటేజీకి వచ్చేనరికి పదకొండు కావొస్తూంది. అక్కడక్కడ విసిరేసినట్టున్నాయి కాటేజీలు.... పోలీసుగార్డు వుంది — మంత్రులుండటంచేత! అతడి పక్కకాటేజ్ రామ్మోహనరావ్‌ది.

అతడు వచ్చిన అయిదు నిముషాలకి ఫోన్ మ్రోగింది. ఎత్తి 'హలో' అన్నాడు.

"నేను హారికని" అని అట్నుంచి వినబడింది.

అప్పటివరకూ అతడిని ఆవరించిన అలసటా, వ్యధా ఆ ఒక్కమాటతో పోయినాయి కిటికీలోంచి తొంగిచూసేడు. పక్కకాటేజీలోంచి ఫోన్‌లో మాట్లాడు

మున్న హారిక నీడ కనబడుతూంది ఆ భంగిమకూడా ఎంతో అందంగావుంది. గాలికి వూగే తెరలవెనుకనుంచి అలలు అలలుగా కదిలే నీడ—

"మీరా...." అన్నాడు.

"గంటనుంచీ ప్రయత్నం చేస్తున్నాను. మీరులేరు".

అక్కడ ప్రతీ కాటేజీకి ఇంటర్నల్ కనెక్షన్ ఫోన్ లున్నాయి.

"నేను లేను" అని, నెమ్మదిగా "నా మనసు బావోలేదు హారికా. ఓటమి చివరి అంచున వున్నాను నేను" అన్నాడు. అతడి గుండె లోతుల్లోంచి వచ్చిన ఆ మాటల సాంద్రతని గుర్తించి ఆమె కంగారుగా "ఏం జరిగింది" అంది.

"ఈ కంపెనీ నాదే నన్న విషయం తెలిసిన మీ నాన్నగారు రేపట్నుంచీ దీనికావలసిన డబ్బు బ్యాంకునించి రాకుండా అడ్డుపడబోతున్నాడు. ప్రారంభోత్సవం జరిగిన మరుసటిరోజు నుంచే ఫ్యాక్టరీ మూతబడితే లేబర్ యూనియన్ ఊరుకోదు-సర్వనాశనమే."

"కానీ దేశంలో వున్నది శివశైలాస్ బ్యాంక్ ఒక్కటే కాదు"

"ఒక బ్యాంకునుంచి ఇంకొకదానికి మారటం అంతసులభం కాదు హారికా-దానికి చాలా తతంగంవుంది".

హారిక కొద్దిసేపు మౌనంగా వుండి నెమ్మదిగా "మీకీ వ్యథంతా నేను ఆరోజు ఫోన్‌చేసి చెప్పటంవల్లనే వచ్చినట్టుంది" అంది.

అతడు కంగారుపడి "లేదు లేదు హారికా మీరు చెప్పటంవల్ల కనీసం నాలుగు అక్షల్లోనన్నా బైటపడగలిగాం. లేకపోతే పూర్తిగా నాశనమయిపోయి వుండేవాణ్ణి" అన్నాడు. (లక్ష్మి ఇంకా షేర్లు అమ్మలేదనీ-టాటావాలా షేర్లుకొనటానికి నిరాకరించాడనీ అతడికింకా తెలీదు).

"రేపు తెల్లవారు ఝామునే మేం వెళ్ళిపోతున్నాం" అంది హారిక. "ప్రోగ్రాం అయిపోగానే మిమ్మల్ని కలుసుకుందామనుకుంటే మీరు లేరు. మీ ఉపన్యాసం చాలా గొప్పగా, నిజాయితీగా వుంది. కంగ్రాచ్యులేషన్స్ స్వయంగా చెబ్దామనుకున్నాను. కానీ ఇప్పుడు చాలా రాత్రయింది."

అడవి-వెన్నెలా యూకలిప్టస్ చెట్ల మధ్యలో ఒక అబ్బాయి అమ్మాయి మాట్లాడుకుంటూ సాగిపోవటం- ఈ ప్రపంచంలో బాధల్నీ డబ్బుతాలూకు వ్యథల్నీ మర్చిపోయి మాట్లాడుకోవటం-ఆ దృశ్యం ఎంతో మనోహరంగా కనిపించింది అతడికి.

అడుగుదామనుకున్నాడు.

సంస్కారం అడ్డొచ్చింది. పైగా బైట పోలీస్ గార్డు వుంది.

అయినా అతడికి ఆనందంగా వుంది. ఆమె తను 'స్వయంగా' అభినందిద్దామనుకోవటం-రాత్రి పదకొండింటికి పక్క కాటేజీలోనుంచి ఫోన్ చెయ్యటం....

అతడు కిటికీ తెర పక్కకి తొలిగించి చూసేడు. కిటికీ వూచమీద చెయ్యి ఆన్చినిలబడివుంది. వెన్నెల ఆమెమీద జారి మరింత మోహనత్వాన్ని సంతరించు




కుంది, ఆమె ఇటే చూస్తూంది. విశాలమైన కళ్ళమీద వెలుగు వరదాగా మెరుస్తూంది.

"....మాట్లాడండి"

"ఏం మాట్లాడను" నిశ్శబ్దం చీల్చబడటానికి ఇష్టపడటం లేదు.

"ఎంత వరకూ వచ్చింది మీరు పందెం గెలవటం?"

"ఇక ఏ ఆశాలేదు టైమ్ కూడా ఎంతోలేదు. తేలిగ్గా అనటానికి ప్రయత్నించాడు.

"మరీ నిరాశ చెందకండి."

కేవలం అవి ఓదార్పు మాటలే అని అతడికి తెలుసు. కనుచూపు మేరలో ఎక్కడా ఆశా కిరణం కూడా కనబడటంలేదు.

"మరి నేను వుంటాను నాన్నగారి మీటింగ్ కూడా పూర్తి కావొచ్చింది."

గాంధీ ఉలిక్కిపడి "ఎవరితో మీటింగ్?" అన్నాడు.

"విద్యార్థితో....దాదాపు రెండు గంటల్నుంచీ వాళ్ళు మాట్లాడుకుంటున్నారు"

అంతే! గాంధీ చేతిలోంచి టెలిఫోన్ జారిపోయింది.

మొహం అంతా చెమట పట్టింది.

అదే సమయానికి విద్యార్థి పక్క కాటేజిలోంచి బైటకి వస్తూ కనిపించాడు. కిటికీలోంచి గాంధీని చూసి ఇటు నడిచేడు.

"ఏం జరుగుతూంది ఇంతసేపూ" గాంధీ తనని తను కంట్రోల్ చేసుకుంటూ అడిగాడు. అయితే అతడి టెన్షన్‌ని విద్యార్థి గమనించలేదు. తేలిగ్గా" మన ఫ్యాక్టరీ ఉత్పత్తి చేసే కాగితం అంతా రామ్మోహనరావ్‌కి ఇవ్వాలని చాలా కాలం క్రితం అగ్రిమెంట్ అయ్యాం కదా సార్" అన్నాడు.

"అవును"

"ఆ అగ్రిమెంట్‌లో కొన్ని మార్పులు సూచించాడు ఆయన."

వణుకుతూన్న కంఠంతో "ఏమిటవి?" అని అడిగాడు గాంధీ.

"మనం అనుకున్న సమయానికి 'కాగితం' సప్లయి చేయకపోతే పెనాల్టీతోపాటు క్రిమినల్ ప్రొసీడింగ్స్‌కూడా పిలయ్యే షరతులు చేర్చి అగ్రిమెంటు తిరగరానుకున్నాం."

గాంధీ ఒక్కసారిగా నిర్విణ్ణుడయ్యాడు.

అనాలోచితంగా గడ్డిమేస్తూన్న లేడిపిల్లకి ఒక్కసారి వేటగాళ్ళు చుట్టుముట్టి బంధించిన అనుభూతి.

రామ్మోహనరావు ఎంత షార్ప్‌గా రియాక్ట్ అయ్యాడు!

తనని వేదికమీద చూడగానే-వెంటవెంటనే ఆలోచించేసేడన్న మాట! తను ముందుకు వెళ్ళే లోపులో, తనకన్నా ముందుగా చదరంగపుఎత్తు వేసేసేడు........ తనేమో వెధవలా శివలింగాల్నీ-టెలిఫోన్లనీ పట్టుకు వేలాడుతున్నాడు. ఇక్కడ ఆయన విద్యార్థితో అగ్రిమెంట్ తిరగ వ్రాయించేడు. తనని మరింత బిగించాడు.

చచ్చిన పాముని మరింత చంపేసేడు.

రేపట్నుంచీ ఫ్యాక్టరీ మూతపడితే తను కాగితం సప్లయిచెయ్యలేడు. దాంతో రామ్మోహనరావు కోర్టుకి వెళ్తాడు....తాము జైలుకి వెళ్తారు.

ఎంత అనుభవజ్ఞుడీ రామ్మోహనరావు!!! తను ఉపన్యాసం చెప్పి వేదిక దిగేలోపులో విద్యార్థిని ట్రాప్ చేసేడు.

తనింకా నేర్చుకోవాలి. చాలా నేర్చుకోవాలి.

అంతలోనే అతడికి నవ్వొచ్చింది. ఇంక నేర్చుకోవటానికేమీలేదు.

"విద్యార్థీ!" అన్నాడు "....లెటజ్, సెలబ్రేట్ ది డిఫీట్ బాటిల్ విప్పు." అతడినోటివెంట వచ్చిన ఈ కోర్కెని విని "సార్" అని విద్యార్థి అయోమయంగా అన్నాడు. గాంధీ అల్మైరా తెరిచాడు....నాయకుల కోసం తెచ్చిన బాటిల్స్‌వున్నాయి "సమ్‌థింగ్ స్పెషల్...." అంటూ చదివి నవ్వేడు. 'అవునీ రోజు సమ్‌థింగ్ స్పెషలే' అన్నాడు.

విద్యార్థి గాంధీవైపు చూసేడు. గాంధీ రెండు గ్లాసుల్లోనూ పోసేడు. మొదటి పెగ్గు-రెండు-మూడో పెగ్గూ పూర్తయింది.

"ఇంతకాలం మనుషులు ఎందుకు తాగుతారా అనుకునేవాణ్ణి. ఎంతడబ్బు సంపాదించినా తాగుడు అలవాటు కాలేదుకదా అని గర్వపడేవాణ్ణి! ఇప్పుడర్థమయింది ఫ్రెండ్. లక్షలు లక్షలు సంపాదించినవాళ్లు ఈ స్కాచ్‌ని ఎందుకు ఆశ్రయిస్తారో!

పగలంతా వళ్ళువంచి పనిచేస్తే కలిగే అలసటకీ, ఒకేసారి లక్ష కోల్పోతే వచ్చే మానసిక అలసటకీ తేడాలేదు. వాడు సారాతాగుతాడు, వీడు స్కాచ్ తాగుతాడు అంతే తేడా! తాగెయ్యి బ్రదర్- రేపట్నుంచీ మనకి సారాకూడా వుంటుందో

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవించే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన మాత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:**


మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.


కోల్గేట్ యొక్క పాటిశీవి చర్యగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.


ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉండడన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా మింటు రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.**

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC G 74 TL

వుండదో

అయిదో పెగ్గు పూర్తయ్యేసరికి విద్యార్థి పడిపోయాడు వనిలో అఖండుడే గానీ మిగతావాటిలో అల్పప్రాణి

గాంధీకి కొత్తే కాని అదేమి విచిత్రమో తాగుడుకూడా అతని వ్యధని మరిపించలేకపోతూంది రక్తసంబంధం కట్టిన అయిదంతస్తులమేడ కనుల ముందే కూలిపోతే కలిగే అనుభూతి అతని మత్తును డామినేట్ చేస్తుంది. ఎంత తాగినా తృప్తి లేదని తెలిసిపోయింది

బాటిల్ పూర్తయ్యేసరికి మూడయింది

కాటేజీ పైకొచ్చాడు అడవంతా నిద్రపోతూంది తిరిగి లోపలికివెళ్ళాడు. లక్ష్మి షేర్లు అమ్మేసిందో లేదో రామ్మోహనరావు అక్కడ ఎలాంటి దెబ్బకొట్టాడో? ఇక్కడ ఇంత వేగంగా రియాక్ట్ అయినవాడు అక్కడమాత్రం ఊరుకుని వుంటాడా?

ఈ ఆలోచన వచ్చేసరికి ఇక ఆగలేకపోయాడు

అప్పటికప్పుడు ట్రంక్‌కాల్ చేసేడు రాత్రి మూడు అవటంవల్ల వెంటనే కాల్ మెచ్యూర్ అయింది

ప్రియంవద ఎత్తుకుంది ఫోను లక్ష్మి లేదు రాత్రి పదింటికి హఠాత్తుగా టాక్సీ వేసుకుని బయల్దేరింది" అన్నది

"ఎక్కడికి"

"మీ దగ్గరకే-"

గాంధీకి ఇది మరో షాకు, ఇన్నివందల మైళ్లు ఇంత రాత్రికి రాత్రి బయల్దేర వలసిన అవసరం ఏముంది? అందులోనూ ఈ అడవిలోకి- ఒంటరిగా?

ఎంతో కొంపమునిగే పని జరిగితేగానీ ఆమె అలా బయల్దేరి వుండదు

అతడు జీవితంలో మొట్టమొదటిసారిగా భయపడ్డాడు. విధి అన్నివైపుల్నించీ ఒక్కసారిగా పగతీర్చుకుంటూందా ? అతడికి ఏం చెయ్యాలో తోచలేదు.

ఇంకో రెండు మూడు గంటల్లో లక్ష్మి ఇక్కడికి చేరుకుంటేగానీ అసలు విషయం తెలియదు

గడియారం నాలుగుకొట్టి, ప్రోగ్రాంని గుర్తుచేసింది స్నానంచేసి తయార య్యేడు నాలుగన్నరకి కబురొచ్చింది

ఇద్దరే-గార్డులు లేకుండా బయల్దేరారు

లాల్చీ పైజమాలో సుబ్బారావు చౌదరి హుందాగా వున్నాడు మెడలో బైనాక్యులర్స్ వేలాడుతున్నాయి

మామూలు సమయాల్లో ఈ కేంద్ర మంత్రితో రెండునిముషాల ఇంటర్వ్యూ దొరకటమే చాలా కష్టం అయిపోతుంది

ఇద్దరూ రెండు ఫర్లాంగులు నడిచేసరికి అడవి ప్రారంభం అయింది తూర్పు నుంచి సూర్యుడు నెమ్మదిగా పైకి వస్తున్నాడు పక్షుల కిలకిలారావాలు మొదల



య్యాయి. ప్రకృతి సృష్టించే ఆ దృశ్యం ఎంతో మనోహరంగా వుంది.

"ఆర్నితోలజీ ... అన్నాడాయన. "అందే పక్షుల్ని గమనించే హాబీ-ఇది తెలియని వాళ్ళకి ఎంతో హాస్యాస్పదంగా వుంటుంది. కానీ చూడు నీచుట్టూ ప్రపంచం ఎంత అందంగా వుందో"

నిజమే అనుకున్నాడు గాంధీ. ఆయన కొనసాగించాడు-"రాజకీయాల్లోకి రాక పోయివుంటే నేను ఆర్నితాలజిస్ట్‌గా మారివుండేవాణ్ణి. 'సలీంఆలీ' అంత గొప్పవాణ్ణి కాలేక పోయినా-గణనీయమైన కృషి గావించేవాడిని. బిలవ్ బర్డ్ వాచింగ్... ఢిల్లీ జనపథ్‌లో మా ఇళ్ళ చుట్టూ తుప్పలూ అడవి! తెల్లవారేసరికి అరుదైన పక్షులు అక్కడికి చేరుకుంటాయి." అంటూ నవ్వి, "కొంచెం పొద్దెక్కాక అవి వెళ్ళిపోయి ఆ జనారణ్యంలోకి రాజకీయ మృగాలు వస్తాయి." అన్నాడు.

గాంధీ ఉలిక్కిపడి ఆయనవైపు చూసాడు. ఆయన బైనాక్యులర్స్‌లోంచి దూరంగా చూస్తున్నాడు. చూస్తూ అంటున్నాడు.

"పక్షిని చూసి మనిషి నేర్చుకోవలసింది చాలా వుంది. ఆహారం కోసం అది ఎప్పుడూ ఎగురుతూనే వుండాలి. ఏదేగ ఏమూల నుంచి వస్తుందో వెయ్యి కళ్ళతో గమనిస్తూ వుండాలి. అయినా అదెప్పుడూ-అయ్యో నేనెంత కష్టపడుతున్నాను అన్న సెల్ఫ్ పిటీతో బ్రతకదు. ఈ సెల్ఫ్‌పిటీ అన్నమాట నేనెందుకు వాడానూ అంటే-అది నిన్న రాత్రి నీ స్పీచ్‌లో చాలా కనిపించింది."

గాంధీ నిశ్చేష్టుడయ్యాడు.

ఒక వడ్రంగి పిట్ట చప్పుడు చేసుకుంటూ చెట్టుని తొలుస్తోంది. కొన్ని డ్రాంగోస్ (కొత్వాలు పక్షులు) తూర్పు దిక్కుగా ఎగురుతూ వెళ్ళున్నాయి.

---

గమనిక : జ్యోతి-భాగ్యలక్ష్మి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతుల మొత్తం రు. 7,500 లుగా గమనించ ప్రార్థన. జరిగిన పొరపాటుకు క్షంతవ్యులం. -సం.

"నా తండ్రి ఒక రిటైర్డ్ స్కూల్ టీచర్. చాలా బీద కుటుంబం మాది. ఆస్థితినుంచి ఇప్పుడు కేంద్ర ఆర్థిక మంత్రిగా పొజిషన్‌కి ఎదిగాడంటే మధ్య ఎన్నో గోతులు-మిట్ట పల్లాలు. రెండు సార్లు ఆత్మహత్య కూడా చేసుకునేటంతగా ప్రేరేపించిన పరిస్థితులు——"

గాంధీ కళ్ళప్పగించి చూస్తున్నాడు. అతడికి క్రితంరాత్రి తను సమస్యనుంచి దూరంగా పారిపోవటంకోసం తాగటం జ్ఞాపకం వచ్చింది.

"అంతవరకూ ఎందుకు? ఈరోజు దేశంలో ఆర్థిక వ్యవస్థ నంతటినీ ఒక్క పెన్నుగీతతో మార్చగల నేను-సరిగ్గా ఆర్నెల్లక్రితం వేరే ప్రభుత్వం అధికారంలో వున్నప్పుడు జైల్లో ఖైదీగా వున్నాను. ఇంతకన్నా హుమిలియేషన్ ఇంకేం కావాలి?"

గాంధీ మాట్లాడలేదు. ఆయనే అన్నాడు.

"నిన్న రాత్రి నువ్వు మైకుదగ్గర మాట్లాడుతూవుంటే పాతిక సంవత్సరాల క్రితపు నాకు నేను జ్ఞాపకం వచ్చాను. ఇదే ఫ్రస్ట్రేషన్-ఇదే ఆవేశం! కృషి నిర్వీర్యం అయిపోతూందే అన్న రొగులు... కానీ ఇదంతా జీవితపు ఆటలో ఒక భాగమే (Its all in the game అన్నమాట వుపయోగించాడాయన). ఇది తెలుసుకోవటానికి నాకు పది సంవత్సరాలు పట్టింది. అప్పుడే నిసలైన రాజకీయ నాయకుణ్ణి అయ్యాను. నిన్న నిన్ను చూసి నా పాతరోజులు గుర్తొచ్చి, ఈరోజు నిన్ను ఇలా ఆహ్వానించాను. కేవలం ఇది చెప్పటంకోసమే. ఈ ప్రపంచంలో నిజంగా కష్టపడే వాళ్ళు చాలా కొద్దిమంది వుంటారు. మిగతావాళ్ళంతా వాళ్ళని విమర్శిస్తూనో, మెచ్చుకుంటూనో గడిపేస్తూ వుంటారు. నిజంగా కష్టపడేవాళ్ళు ఫ్రస్ట్రేషన్‌ని తమ ఛాయలకి రానివ్వకూడదు. అంతే నేను చెప్పదల్చుకున్నది. ఒక పక్షియొక్క స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్ గమనించడమే ఆర్నితోలజీ...."

ఆ తరువాత వాళ్ళు ఇక ఆ విషయం మాట్లాడుకోలేదు. రెక్కలమీద తెల్ల మచ్చలున్న మైనాలని చూసేరు. దండకారణ్యంలో తరచుగా కనబడే బంగారురంగు ఒరిల్లోన్‌ని చూసారు. తెల్లటి చారలున్న నల్లటి మాగ్‌పై రాబిన్స్‌ని చూసారు. ప్రకృతిలో కలిసిపోయారు.

తిరిగివచ్చేసరికి ఆరున్నరయింది. వస్తూంటే గాంధీ అడిగాడు. "పేపరు పరిశ్రమ భవిష్యత్తు ఎలా వుండబోతూంది?" అని.

"గొప్ప ప్రమాదాన్ని ఎదుర్కోబోతూంది".

గాంధీ ఆశ్చర్యంగా "ఎందుకు" అని అడిగాడు.

"ఓవర్ లైసెన్సింగ్" అన్నాడాయన. "....ఉదాహరణకి ఆంధ్రరాష్ట్రాన్నే తీసుకో. రాజమండ్రీ పేపర్ మిల్స్, సిరిపూర్ కాగజ్ మిల్స్, మిగతావి కలిపి రోజుకి 2400 టన్నుల కలపని వినియోగం చేస్తాయి. ఒక చెట్టు వృక్షంగా మారటానికి ఏడు సంవత్సరాలు పడుతుంది. కాబట్టి దీన్నిబట్టి ఆలోచించు, రాష్ట్రంలో ఈ ఏడు సంవత్సరాల్లో (అంటే తిరిగి చెటు మొలిచే వరకూ) ఎంత అడవి కొట్టి

## సన్నిహితంగా మెలిగేటప్పుడు ముత్యాల నవ్వులు వెదజల్లండి

# క్లోస్-అప్

నోటిగాలి మరింత తాజాగా
పలువరస మరింత తెల్లగా వుండటం కోసం

క్లోస్ అప్‌లో గల
అసలైన మౌత్‌వాష్
మీ నోటి గాలిని అతి
తాజాగా ఉంచుతుంది
క్లోస్ అప్‌లోగల
అత్యంత తెలుపు నిచ్చే
రెండు పదార్థాలు
మీ పళ్లను అతి తెల్లగా
మెరిపిస్తాయి

క్లోస్-అప్ సన్నిహితుల కోసం




టూత్‌పేస్ట్ మరియు మౌత్‌వాష్ ఒకేదానిలో

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS-CX-45-1811-TL

య్యేలో(.. సంవత్సరానికి 300 పని దినాలు అనుకుంటే.)

2400 టన్నులు X 7 సంవత్సరాలు X 300 రోజులు = 50,40,000 టన్నులు అంటే దాదాపు ఆరవై వేల ఎకరాలు. నిజానికి ఆంధ్రరాష్ట్రానికి ఇంత అటవీ సంపద వున్నదా? ఇలా అడవుల్ని కొట్టుకుంటూ పోతే వాతావరణం ఏమవుతుంది? ఇవన్నీ కాదు ప్రశ్నలు మా రాష్ట్రంలో, మా తాలూకాలో మా బంధువులకి మరొక్క లైసెన్సు ఇప్పించండి అని ఢిల్లీలో తిష్టవేసే ఛోటా రాజకీయ నాయకులకి తెలీదా ఈ నాశనం సంగతి? వారితో సంబంధాలు పాడుచేసుకోవటం ఇష్టంలేక లైసెన్సులిచ్చే మాకు తెలీదా?? మమ్మల్ని విమర్శించే ప్రతిపక్షాలకి తెలీదా - వాళ్ళు అధికారంలోకి వచ్చినా ఇది తప్పదని....ఇదంతా ఎందుకంటే-"ఇట్సాల్ ఇన్ ది గేమ్" అంటూ నవ్వేడు.

విప్పారిన నేత్రాలతో గాంధీ ఆయనవైపు చూసేడు.

అప్పటి వరకూ గాంధీకి మంత్రులన్నా-రాజకీయ నాయకులన్నా చాలా తేలిక అభిప్రాయం వుండేది. ఎన్నో వ్యంగ్యచిత్రాలని వారిమీద చూసాడు, ఆ ఖద్దరుటోపీల క్రిందున్న తలలో మెదడు వుంటదని నమ్మేడు. ఇప్పుడు చూస్తున్న దృశ్యం వేరు. భారతదేశపు ఆర్థిక మంత్రి ఆంధ్రరాష్ట్రపు కాగితపు పరిశ్రమ గురించి లెక్కల్తో సహా చెప్పటం.

ఎందుకో తెలీదు గాంధీకంట నీరు తిరిగింది. "థాంక్యూసర్" అన్నాడు.

ఆయన ఆశ్చర్యంగా "ఎందుకు" అన్నాడు.

''ఇదిమీకు చాలా కొద్ది సమయమే కావొచ్చు. కాని నా జీవితంలో గొప్ప ప్రభావాన్ని చూపిస్తుంది. ఇంతకాలమూ నా ఆలోచనలు ఎంత అల్పమైనవో నాకు అర్థమైంది. ఈ అనామకుడికోసం మీ ప్రాతఃకాలాన్ని వెచ్చించినందుకు మీకు నా కృతజ్ఞతలు".

# 22

ఏడయింది.

మంత్రులు వెళ్ళిపోయారు.

కలకలం తగ్గింది

రామ్మోహనరావు కాటేజీముందు వాళ్ళ కారు ఆగివుంది. వాళ్ళు వెళ్ళిపోటానికి ఆయత్తమవుతున్న సందడి కనిపిస్తూంది.

దూరంగా రాత్రి తాలూకు వేదిక-ఇప్పుడు ఖాళీగా శూన్యంగా ఆస్తి పోగొట్టుకున్న కోటీశ్వరుడిలా కనిపిస్తూంది.

గాంధీ గుమ్మానికి ఆనుకుని రోడ్డువంక చూస్తున్నాడు. అతడు చూస్తూంది లక్ష్మికోసం. లక్ష్మి వేయబోయే మరో బాంబ్‌షెల్ కోసం.

అంతలో దూరంగా టాక్సీ రావటం కనిపించింది. గాంధీ గుండె వేగంగా కొట్టుకోసాగింది. టాక్సీ దుమ్ము రేపుకుంటూ వచ్చి ఆగింది.

అందులోంచి లక్ష్మి దిగింది.

"ఏమిటి ఏమైంది?" అని అడిగాడు గాంధీ ఆతృతగా.




"ఏమైంది-ఏంలేదే-" అంది లక్ష్మి మామూలుగా కనబడటానికి ప్రయత్నిస్తూ.

"కాదు. ఏదో జరిగింది. ఎందుకు నీ మొహం అలావుంది?....చెప్పు. షేర్లు అమ్మేసేవా?"

"లేదు."

గాంధీ జావకారిపోయి "లేదా" అన్నాడు.

"కొనేవాళ్ళు దొరకలేదు"

గాంధీకి ప్రపంచం మీద కూలిపోతున్నట్టు వుంది. అయితే అతడి పరిస్థితిని లక్ష్మి గమనించలేదు. ట్రాన్సిస్టర్ పెట్టడంలో నిమగ్నమై "అబ్బా-ఈ వార్తల సమయానికి ఇక్కడకు చేరుకోవాలని ఆ టాక్సీవాడిని ఎంతతొందరచేసేనో" అంది.

"ఎందుకు" అని అతడనబోతూవుంటే లక్ష్మి "...ష్" అని వినమన్నట్టు సైగ చేసింది. వార్తలు మొదలయ్యాయి.

"ఆకాశవాణి....వార్తలు చదువుతూంది...." అంటూ ప్రారంభమై మొదటి వాక్యంగా న్యూస్ రీడర్ అన్నాడు "....ఆరు ప్రధాన బ్యాంకుల్ని జాతీయం చేస్తూ నిన్న రాత్రి రాష్ట్రపతి ఉత్తర్వు జారీచేసేరు. నిన్నటి బ్యాంకింగు పనివేళలు పూర్తయిన కాలంనుంచీ ఈ వుత్తర్వు అమలులోకి వస్తుంది. జాతీయం చేయబడిన ఆరు బ్యాంకులూ సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర, శివశైలాక్స్ బ్యాంక్...."

గాంధీ చప్పున వెనుదిరిగాడు. అప్పటివరకూ సీరియస్‌గా వున్నది ఇక ఆపుకోలేనన్నట్టు నవ్వసాగింది లక్ష్మి. వర్షాన్ని చూసి చిన్నపిల్లలు ఆనందంతో నవ్వే నవ్వుఅది. కేరింతలు ఒకటే తక్కువ.

కొన్నాళ్ళక్రితం హారిక షేర్లు అమ్మేని రక్షించింది. ఇప్పుడు లక్ష్మి షేర్లు

అమ్మకం బాగా రక్షించింది. ఇప్పుడు షేరు ధర నాలుగువందలవుతుంది అందే నలభై లక్షలు లాభం. అన్నిటికన్నా ముఖ్యంగా ఈ పేపరు ఫ్యాక్టరీ మూతబడదు. రామ్మోహనరావు ఇంకేం చెయ్యలేడు.

గాంధీ ఆనందంతో బిగ్గరగా కేకవేశాడు. వేస్తూ లక్ష్మిని గాలిలోకి ఎత్తాడు. లక్ష్మి అభ్యంతర పెట్టలేదు. ఆ క్షణం వారి సంబంధం స్త్రీ పురుషులది కాదు. యిద్దరు వ్యక్తులు తమ జీవితపు అత్యంత అపురూపమైన విజయాన్ని పంచుకున్నారంతే!

ఇది జరిగే సమయానికి హారిక బ్రీఫ్‌కేస్ సర్ది చేతిలోకి తీసుకుంది. తండ్రి వెళ్ళి కారులో కూర్చున్నాడు. బైటకి రాబోతూ కిటికీ తెర తొలగించి గాంధీ కాబిన్ వైపు చూసింది.

తెరచిన అవతలి కిటికీలోంచి గాలిలో గిరున తిరుగుతున్న లక్ష్మి కనిపించింది....గాంధీ చేతుల్లో.

ఆమె తెర సర్దేసి-వచ్చి తండ్రి పక్కగా కారులో కూర్చుంది.

ఆమె మొహం భావరహితంగా వుంది.

కారు కదిలింది

(ఇంకావుంది)

# పాపిష్టి సంఘం

మంచాన్ని అంటుకుపోయి మూలుగుతూ పడుకొన్న కేశవయ్య కొడుకుని దగ్గరకు పిలిపించుకొనేటప్పటికి వరండాలో మూగిన అప్పులవాళ్ళలో గుంపు బింపులు-"ముసలి ముండా వాడు ధనం దాచే వుంటాడు-మన సంగతి ఏంచెబుతాడో!"

కేశవయ్య కొడుకుని దగ్గరకు రమ్మని ఇలా చెప్పాడు "బాబూ నే బ్రతకను. చచ్చిపోయే ముందు నీకొక సలహా చెబుతాను...." అని చెప్పి బాధతో కొంచెంసేపు ఆగి, ఈవిధంగా పూర్తి చేశాడు "చచ్చి పోయేటప్పటికి వీలైనన్ని అప్పులు చేసి వుంచుకో. ఈపాపిష్టి సంఘాన్ని మోసం చెయ్యగలిగాననే తృప్తి వుంటుంది."

తండ్రి ఈమాటలు చెప్పినపుడు కొడుక్కి కష్టం వేసింది. కానీ పెద్దవాడై లోకులు తన్ను ముంచి, చచ్చిపోయేటప్పుడు ఒక పిట్టయినా చూడటానికి రానప్పుడు, తండ్రి మాటలు విననందుకు పశ్చాత్తాప పడ్డాడు—

గోపీచంద్



# మగ పెళ్ళివారు పగటిపూట తరలి వస్తున్నారు

ఇది మంచి ఆనవాయితీ. విలువైన విద్యుత్తును అనవసరమైన ఊరేగింపు పైన ఖర్చు చేయరాదు కట్నం ఉచ్చులో చిక్కుకున్న పెళ్ళికూతురు తండ్రికి వెలుగుతున్న ప్రతి బల్బు తేలులాగా కుడుతుంది.

కట్నం ఒక దురాచారం అని తెలుసు ఆయనకు. అందుకని కట్నాన్ని లోపాయకారిగా తీసుకుంటారు ప్రజలు. కనీసం గొప్పకోసం చేసే ఆర్భాటాన్ని పూర్తిగా మానాలి. మనిషికి నెత్తురులాగా సంఘానికి విద్యుత్తు ఎంతో అవసరం. ఎవరైనా రక్తాన్ని వృధా చేస్తారా?

1980 81 లో 1185 మిలియను యూనిట్ల విద్యుత్తును ఉత్పత్తిచేశాం. 1981-82 లో 180 మిలియను యూనిట్లను ఉత్పత్తి చేయటం మన లక్ష్యం. ఇంకా వివరాలు కావాలంటే, ఈ క్రింది కూపను నింపి పోస్టు చేయండి.

---

డెప్యూటీ డైరెక్టరు,
మాస్ మెయిలింగు యూనిట్, డైరెక్టరేట్ ఆఫ్ ఎడ్వర్టయిజింగ్ అండ్
విజువల్ పబ్లిసిటీ,
"బి" బ్లాక్, కస్తూర్బా గాంధీ మార్గ్, న్యూఢిల్లీ-110 001.

---

20 సూత్రాల కార్యక్రమానికి సంబంధించిన ఇంగ్లీషు/హిందీ పుస్తకాన్ని దయచేసి నాకు పంపండి.

---

పేరు ................................................................................

చిరునామా ................................................. పిన్ .....................

davp 81/383




## షహనాజ్ బేగం



ప్రియమైన అక్కకి,

సుధ వ్రాయునది. మేము యిక్కడ క్షేమం. నీవు, బావ క్షేమం అని తలుస్తాను.

నీ మేలు ఈ జన్మలో మరచిపోలేను. నీవానాడు పూనుకోబట్టే నేనీనాడు నా భర్తతో కలిసి సుఖంగా సంసారం చేసుకొంటున్నాను.

లేకపోతే నాజీవితం కుక్కలుచింపిన విస్తరి అయ్యేది. నేనూహించలేకపోతున్నాను.

అక్కా, బావ సాక్షాత్తు ఆ శ్రీరామచంద్రుడవంటి వారు. మీది ఆదర్శ దాంపత్యం. మా దాంపత్యం కూడా మీలాంటి ఆదర్శ దాంపత్యం కావాలని కోరుకొంటున్నాను. నేను మా వారు మీకు ఋణపడి వుంటామక్కా.

నేను ఆనాడు నా భర్తతో పోట్లాడి పుట్టింటికి చేరినప్పుడు నాకెన్నో హితబోధలు చేశావు. ఆడదానికి పుట్టిల్లు శాశ్వతం కాదనీ, మంచిఅయినా చెడు అయినా తన భర్తదగ్గరే వుండాలనినచ్చచెప్పావు. భర్త,పిల్లలులేని ఆడదానిజీవితం మోడైన చెట్టులాటిదని అన్నావు. నాకెంతో ధైర్యాన్ని యిచ్చావు నా భర్త నుంచి విడాకులు పొందాలనుకొన్న నేను హాయిగా నా భర్తతో అన్యోన్యంగా దాంపత్య జీవనము గడుపుతున్నాను. ఇదంతా నీ చలువతోనక్కా. మా వారికి నచ్చచెప్పి నా కాపురం చక్కబెట్టావు. మావారు నన్ను వదలి ఒక్క క్షణం వుండలేకపోతున్నారు. మావారి నుంచి నమస్కారములు అందుకో.

ఇట్లు
నీ చెల్లెలు
సుధ.




ఉత్తరం చదివి పక్కన పడేశాను. చెల్లినుంచి ఉదయం వచ్చిన ఈ ఉత్తరం ఏ పదోసారో చదవటం.

రాత్రి పదిగంటలు దాటాయి.

కానీ శ్రీవారువచ్చే జాడలు కనిపించ లేదు.

సుధ రాసిన మాటలు గుర్తుకు వచ్చాయి.

తనది ఆదర్శ దాంపత్యం అట.

ఆయనగారు సాక్షాత్తు శ్రీరామచంద్రుడట! యింకా నయం.

నా పెదవులపైన విషాదమయిన చిరునవ్వు వొకటి క్షణమాత్రం వెలిగి మాయమైంది.

బయటచీకటిగాఉంది తనజీవితంలా.

యింతలో బయట స్కూటర్ చప్పుడయింది. వెళ్ళి తలుపుతెరిచాను.

విస్కీ వాసన గుప్పుమంది.

పేకాటలో ఓడిపోయిన తాలుకు కోపంతో రుసరుస లాడుతు వచ్చారు లోపలికి.

"ఏమిటే దౌర్భాగ్యపు మొహావా! అలా నిలబడ్డావు. లోపలకి తగలడు" అన్నారు. విసురుగా నన్ను నెట్టుతూ,

నీరసంగా లోపలికి నడిచాను

రోజు జరిగే తతంగమేయిది.

ఆఫీసు వదలినతరువాత ఏ క్లబ్బులోనైనా దూరి పేకాట ఆడి, తప్పతాగి, ఏ అపరాత్రికో (ఇల్లు గుర్తుకువస్తే) ఇంటికి చేరేవాడు. పెళ్ళయి ఇన్నాళ్ళు గడిచినా అతని ప్రవర్తనలో ఎలాంటి మార్పు రాలేదు.

అతనిని మార్చాలని శతవిధాల ప్రయత్నించి విఫలమైంది. కాలమే అతనిలో మార్పు తెస్తుందని అనుకొంది.

కథలలో, సినిమాలలో తనభర్తను అదుపులో తెచ్చుకోలేని ఆడది, ఆడది కాలేదనే మాటా విన్నది. కాని తను ఎంతో సమర్థురాలనీ, ఓర్పు సహనం తనకు పెట్టింది పేరనీ ఇతరులు చెప్పగా విన్నది.

ఎన్నో విడిపోయిన జంటలను కలిపి వారి కాపురాలను చక్కదిద్దింది.

కాని తన భర్త దృష్టిలో తను ఓ

## కావలెను

ఈ శిధిల వ్యవస్థను కూల్చి;
సమసమాజ భవంతికి
'ప్లాన్' గీయగల
ఇంజనీర్ కావలెను.
అర్హత : మానవత్వం.

శివరాం

దేభ్యపు మొహం.... ఓ వెర్రిబాగుల్ది.

ఏమీ చెప్పలేక, చెయ్యలేక, వ్యధా భరితమైన హృదయంతో మౌనం వహించాను.

"ఏమిటే ఆలోచిస్తున్నావు? కూడు వడేస్తావా?"

నా చెంప ఝల్లుమంది.

అతని కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.

చెంపను ఓ చేత్తో తడుముకుంటూ అతనికి అన్నీ అమర్చి పెట్టాను.

భోజనం చేస్తున్నంత సేపూ కూరలకు వంకలు పెడ్తూ తనను పుట్టించిన తండ్రి దగ్గరనుంచి తన వంశ పారంపర్యాన్ని తనకు తెలిసిన బూతుమాటలతో ముంచెత్తి భోజనం ముగించి మంచం చేరాడు. వంటిల్లు సర్దుతున్న నన్ను అతను పిలిచాడు కొద్దిసేపటిపాటు అతని చేతిలో మరబొమ్మనై పోయాను. శారీరక సుఖం అనంతరం అతడు నిద్రలో జారుకున్నాడు.....

ఎందుకో ఆగకుండ కన్నీళ్ళ ధారా పాతంగా కారుతున్నాయి.

కన్నీటితో తలగడంతా తడిసి పోయింది.

ఆలోచనలు పరిపరివిధాల సాగాయి.

దినదిన గండంగా గడిచే యిలాంటి సంసారాన్ని సుధ ఆదర్శ దాంపత్యం అనీ, చండశాసనుడయిన తన భర్తను శ్రీరామచంద్రుడితోనూ పోల్చింది.

సుధా, నాకు నీకు తేడా ఏమిటో తెలుసా? నీవు లోకానికీ సంఘానికిచూసి భయపడక నీ భర్త ప్రవర్తన నీకు నచ్చక, అతనితో ఎదురు తిరిగి వ్యవహారం విడాకులదాకా వచ్చినా, ఇంకా నీ కాపురాన్ని చక్కబెట్టుకొన్నావు. యిందులో నేను చేసిన సహాయం ఏమీ లేదు. నా కష్ట సుఖాలు ఏనాడు పెదవి విప్పి ఎవరికీ చెప్పుకోలేదు నా గుండెల్లో పదిలంగా దాచుకొన్నాను. అనుక్షణం లోకానికీ, సంఘానికీ భయపడే నాలాంటి జీవితాలు ఇలా తెల్లారిపోవలసినదేనమ్మా. అందుకే నీలాంటి అమాయకులు కొందరు ఆదర్శదాంపత్యం అంటూ నా దాంపత్యాన్ని అందలం ఎక్కిస్తూ నీకు నాకు తేడా యిదే తెలిసిందా.

ఆడదానికి మగవాడి అండ ఎంతో అవసరం.

ఆ బలహీనతని కనిపెట్టి ఆడుకోవటం మగవాడికి సరదా. భర్తను వదిలేసిన స్త్రీని సంఘంగౌరవించదు. అలాంటి పరిస్థితి ఎందుకు కలిగిందో లోకానికి సంఘానికి అనవసరం. నీలాంటి ధైర్యస్థులు కొందరు అప్పుడప్పుడు పురుషాధిక్యానికి తల ఒగ్గక ఎదురు తిరుగుతారు. కాని నీ తలిదండ్రులు, ఈ సమాజం, నాలాంటి వారు కొందరు కలసి తిరిగి నిన్ను భర్తకు అప్పచెప్పుతారు ఇదీకథ!

ఆ మాటలు పెదవులమీదినుంచి వచ్చినవి కావు. నా అంతరంగంలో నుంచి వెలువడిన మాటలు.



**పశ్చిమ దిశంతా రంగుల యింద్రజాలంతో అద్భుతంగావుంది,**

స్వరాజ్యం నన్నజాజి మొగ్గలు కోసుకుని పెరట్లోంచి లోపలికి రాబోతూ-పక్క వాటాలో కన్పించిన దృశ్యం చూసి ఆగిపోయింది.

సుందరి పొయ్యి గట్టు ముందు నిలబడి ఏదో వొండుతూంది. ఆమె వెనుక నిల్చున్న సుబ్బారావు ఆమె మెడ చుట్టూ రెండు చేతులూ పెనవేసి మొహం ఆమ భుజం మీద ఆన్చి ఏదో గుస గుసలాడుతున్నాడు.

సుందరి ఏదో తినే పదార్థం అతని నోటికందించింది. అతనువంటితో దాన్ని కొరికి పట్టుకునే ఆమెను తనకు అభిముఖంగా తిప్పుకున్నాడు. ఆమె అతని కళ్ళలోకి చూస్తూ సుతారంగా పెదవులతో ఆ పదార్థాన్ని అందుకుంది. సుబ్బారావు ఆమె నడుం చుట్టూ చెయ్యి వేసి దగ్గరకు తీసుకుని—

ఇక ఆగలేదు స్వరాజ్యం. గబ గబా లోపలికి కొచ్చి తలుపు మూసేసింది.

మనసంతా తనకే తెలియని విధంగా అయిపోయింది'

వొడిలోని నన్నజాజులు గచ్చు నేల మీద జారిపోయినయ్. ఏమీ తోచనట్టు ఆరెండు. గదుల్లోనూ అట్నుంచి యిటూ, యిట్నుంచి అటూ తిరిగింది కాసేపు.

గోడకున్న అద్దం ముందు నిలబడి కాస్సేపు ముఖంచూచుకుంది.

వెళ్ళి మంచంమీద వాలి పోయింది.

పక్కవాటాలోకి సుందరీ సుబ్బారావూ వొచ్చిందగ్గర్నుంచి రాజ్యం మనసు కుదురుగా వుండటంలేదు.

ఆ వాటాలో వాళ్ళుదిగి వారమైంది.

రెండు రోజుల క్రితం—

మధ్యాహన్నం రెండు గంటల వేళ సుందరి పంపు దగ్గర బట్టలుతుక్కుంటూంది.

అతనుఎప్పుడొచ్చాడో, పిల్లిలా మెల్లగా ఆమె వెనక్కు వెళ్ళి నిలబడి తలవంచుకుని బట్టలకు సబ్బు పెడుతున్న ఆమె మెడమీద చటుక్కున ముద్దు పెట్టుకున్నాడు,

అదాటుగా వున్న సుందరి వులిక్కిపడి కెవ్వున అరవబోయి అంతలోనే అతన్ని చూసి ఆగిపోయింది. కళ్లల్లోకి కోపం తెచ్చుకుని

'ఏయ్. దొంగా! వుండు నీ పని చెప్తాను' అని సబ్బు చెయ్యి అతనికి

# వెలుగు రేఖ

## —చీర్ల సీతాదేవి

పూయటానికి లేచింది అతను లోపలికి పరుగెత్తాడు.

సుందరి అతన్ని తరుముకుంటూ పరుగెత్తింది.

ధన్ మంటూ తలుపులు మూత పడినాయి.

లోపల్నుంచి కిల కిలనవ్వులు.— మాటలు....

బయట పంపుకింద బకెట్-అందులో నబ్బు రాసిన బట్టలు.

ఆమె అందులో వడేసివోయిన కొత్త రిన్ నబ్బు.

వాటిమీదధారగా పడుతున్న పంపు నీళ్ళు-

వంటింటి కిటికీలోంచి చూస్తూ అట్లా ఎంతో సేపు నిలబడిపోయింది స్వరాజ్యం. టాంకు ఖాళీఅవుతే మళ్లా రేపటికి నీళ్ళుండవన్న స్పృహ చటుక్కునవచ్చి, తలుపు తెరచుకుని వెళ్ళి పంపు కట్టేసి వచ్చింది.

పక్కవాటాలోంచి నవ్వులు....గాజుల గలగలలు....

అప్పుడప్పుడూ మాటలు వినబడు తూనే వున్నాయి.

గడియారంవేపు చూస్తూ అశాంతితో ఆలోచనలతో గడిపివేసింది మళ్ళీసుందరీ వాళ్ళు వాటా తలుపులు తెరుచుకునే వరకూ.

నిన్నకాక మొన్న అలా చేసింది ఆ యిద్దర్నీ.

యీ రోజు ఇలా.

ఎంత అన్యోన్య దాంపత్యం?

తను సరిగ్గా మూర్తితో ఇలా ఉండా లనేగా కోరుకునేది.

అయితే శృంగారాన్ని అపురూపమైన కళగా మార్చుకుని అనుభవించటం చేత గాని మనిషి మూర్తి.

'వొట్టి బుద్ధావతారం' అనుకుంది.

మంచంమీదగోడకి ఆనుకునికూర్చుని నేలమీద కుప్పగా పడున్న పూలకేసి చూస్తూ, తన బాల్యాన్ని, నిస్సారమైన తన రెండేళ్ళ కాపురాన్నీ సింహావలోకనం చేసుకుంటున్న దానిలాగా కూర్చుండిపోయింది.

చెంచయ్యకు ముగ్గురు కొడుకుల తర్వాత పుట్టింది స్వరాజ్యం గారాబంగా ఆడిందిఆటగా పాడింది పాటగాపెరిగింది.

సినిమాలూ, స్నేహితులు, పుస్తకాలు అంటే ప్రాణం పెట్టేది.

అన్నగారికోసంవచ్చిన స్నేహితులతో నిర్భయంగా నిస్సంకోచంగా మాట్లాడేది.

ఫేషన్ల బట్టలు ధరించటం, నీట్‌గా తయారై బడికి వెళ్ళటం, స్నేహితులతో కలిసి కనిపించిన వాళ్ళనల్లా ఏడిపించటం తప్ప చదువుమీద ధ్యాసలేదు స్వరాజ్యానికి.

తల్లి ఉబ్బసంరోగి. యింట్లో వంటా వార్పూ విధవ మేనత్త చూసుకునేది.

రాజ్యానికి పదహారో ఏడు వొచ్చిం దగ్గర్నుంచీ 'యిక దానికి చదువుచాలు. పెళ్ళి చేసెయ్యి' అంటూ తమ్ముడ్ని సాధించటం మొదలు పెట్టింది ఆవిడ.

తల్లి కూడా కొడుకులమాట ఎలా ఉన్నా రాజ్యంపెళ్ళిచూసి కన్నుమూసినా చాలనుకునేది.

అప్పుడే చెంచయ్య సంబంధాలు చూడటం మొదలు పెట్టాడు.

పెళ్ళని తెలిసింది మొదలు కలలు కనటం మొదలుపెట్టింది రాజ్యం.



ఏ సంబంధం తెచ్చినా యితను షరీ నలుపనీ, అతను మరీ తెనితెలుపనీ. ఒకతను సరైన మాచింగు బట్టలు వేసుకోలేదనీ, ఒకతను బూట్లు ధరించకుండా హవాయి చెప్పుల్తో వొచ్చాడనీ యిట్లా వంకలు పెడుతూ వుండేది.

మేనత్త, తల్లి, చివరికి తండ్రికూడా విసిగిపోయారు.

రెండేళ్ళతర్వాతవచ్చింది రామ్మూర్తి సంబంధం.

మనిషి సింపుల్‌గా స్మార్ట్‌గావున్నాడు. చూడగానే నచ్చాడు రాజ్యానికి. అయితే అతని వివరాలు విని ముఖం మాడ్చుకుంది.

చదువు పెద్దగాలేదు. ఒక ప్రయివేటు నర్సింగ్ హోమ్‌లో కాంపౌండరుగా చేస్తున్నాడు.

వొద్దనేసింది. అంతాకలిసి నచ్చజెప్పారు

'ఒక్క ఆడపిల్లవని నిన్ను అపురూపంగా పెంచామే. నువ్వుకోరిన సంబంధం తెచ్చి చెయ్యటానికి మేమేం లక్షాధికార్లం కాదు. ఈ ఉన్న అడితీయే ఆధారం. ఇంకా అన్నయ్యల చదువులున్నాయి. ఇతను మంచి వాడు. బుద్ధిమంతుడు. వెనకాల కాస్తో కూస్తో ఆస్తి వున్నవాడు. ఇంకా చిన్నవాడేగనుక వృద్ధిలోకివస్తాడు. లేదా ఏ వ్యాపారమో చేసుకుంటాడు, ఇంత అనుకూలమైన సంబంధం మళ్ళీ మళ్ళీ రాదు. అత్తమామలుకూడా మంచి వాళ్లు" అంటూ నచ్చజెప్పి వొప్పించి పెళ్ళిచేశారు.

పెళ్ళవగానే ఓ రెండుగదుల పోర్షను చూసుకుని నెలలోపే భార్యను తెచ్చుకున్నాడు రామ్మూర్తి రాజ్యానికి ఆ ఇల్లు నచ్చలా. పెళ్ళికిముందు వూహించుకున్న ఇంటికీ దీనికీ ఎక్కడా పోలికలేదు.

ఎవరన్నా వొస్తే కూర్చునేదీ. పడు

కునేదీ అన్నిటికీ ఆ ఒక్క గదే. రెండోది వంటకీ తిండికీ వంటగది తలుపుతీస్తే రెండు పోర్షన్లకీ కామన్ బాత్‌రూమ్ -పైపు బట్టలుతుక్కోవటానికీ ఆరేసుకోవటానికీ చిన్న వెరడు. ఇంటిముందు కొద్దిగా ఖాళీ స్థలం, గోడ. గేటుకి అటొకటి ఇటొకటి కొబ్బరిచెట్లు.

ఇల్లు చూసి "ఇంకా నయం పక్క వాటాలో ఎవరూ లేరు" అనుకుంది.

మర్నాడినుంచే రామ్మూర్తి డ్యూటీలో చేరాడు.

ఉదయం లేవగానే కాలకృత్యాలు తీర్చుకుని ముందు తలుపులు బంధించు కుని కానేపు ఆసనాలు వేస్తాడు. తర్వాత స్నానం టిఫిన్ చేసుకుని సైకిలెక్కి హాస్పిటల్‌కి వెళ్ళిపోతాడు వెళ్ళేముందు మధ్యాహ్నం భోజనానికి వస్తానని చెప్పి వెడతాడు.

హాస్పిటల్‌లో మూర్తికి పూర్తిగా పని పేషెంట్లకు మందులు యింజక్షన్లు యివ్వటం వసూలైన డబ్బు డాక్టరుగారికి అప్పగించటం - యిలా ఎన్నో -

డాక్టరుగారికి మూర్తి మీద మంచి అభిప్రాయం వుంది. అందుకే తానులేని సమయాల్లో నిశ్చింతగా హాస్పిటల్ బాధ్యత మూర్తి మీద పెడతాడు.

మధ్యాహ్నం తన కోసం రాజ్యం చూస్తూ వుంటుంది వెళ్లాలని ఆలోచన వున్నా పని తెములక బాయ్‌తో కాఫీ తెప్పించుకు తాగి సరిపుచ్చుకుంటాడు.

నాలుగు గంటల ప్రాంతంలో యింటి కొస్తాడు. రాజ్యం యిచ్చిన టీ తాగి స్నానం చేసి బట్టలు మార్చుకుని రాజ్యం అడిగే· వాటికి జవాబు చెప్తూనే హడా వుడిగా తయారై మళ్ళా హాస్పిటలు చేరుకుంటాడు.

మళ్ళీ రాత్రి పదికే రాక.

పగలంతా ఆతనికోసం ఎదురు చూస్తూ వుంటుంది రాజ్యం.

రాత్రి నిద్ర కళ్ళతో తలుపు తెరుస్తుంది.

అతను లోపలికివొచ్చి బట్టలు మార్చుకుని పీట వాల్చుకుని కూచుంటాడు.

రాజ్యం కోపంతో ముభావంగా వడ్డిస్తుంది.

ఆకలితో వుంటాడేమో అతను ఆవురావురు మంటూ తినేసి పేపరు పట్టుకుని పడకుర్చీ లో కూర్చుంటాడు.

కళ్ళు మూతలు పడ్తుంటే కోపంతో వుక్రోషంతో రాజ్యం అతన్ని 'లేవండి. పడుకుందురు గాని అంటూ మంచం వరకూ చేయి పట్టుకుని నడిపించుకు వెళ్తుంది. లైటార్పి అతని పక్కన చేరుతుంది.

నిద్ర కళ్ళతోనే భార్యను దగ్గరకు తీసుకుంటాడు....

తెల్లవారుతుంది.

ఇలాటి దినచర్యతో వారం రోజులు గడిచే సరికి రాజ్యానికి మతి పోయింది.

పెళ్ళంటే ఒక రోజు సంబరమా? తాను ఎన్ని కలలుకంది?

ఎన్ని వూహించుకుంది. అతనితో సినిమ లు-షికార్లు-కబుర్లు- సేచ్ఛగా, గూటిలోని గువ్వల్లాగా, గాలిలో పక్షుల్లాగా వుండాలనుకుంది.

వుదయం నుంచి రాత్రి పది గంటల వరకూ యీ రెండు గదుల్లో గడ

పొలంటే పిచ్చెక్కిపోదూ ఊహల్లో చెక్కిళ్లలా కనిపించే కాపురం వాస్తవంలో బ్లాక్ అండ్ వైట్లో కన్పించే సరికి మతి పోయింది

తనభర్తకు తనకన్న, ఆహాస్పిటలూ మందులూ రోగులూ అవే ప్రియమైన వన్న భావనతో ఆమెలో మంటలు రేగాయి మనసులో" యితన్ని యిలా వొదిలేసి వూరకోగూడదు తనకు నచ్చేలా తీర్చి దిద్దుకోవాలి అన్న నిశ్చయానికి వొచ్చింది

మర్నాడు వుదయం- అతని చేతికి టిన్ ప్లేటుఇచ్చి-కుర్చీ చేతిమీదకూచుని మూర్తీ ఇంట్లో నేనొక్కదాన్నే రాత్రి వరకూ వుండాలంటే తోచటంలేదు'అంది అతని క్రాపు సరిచేస్తూ

మూర్తి తెల్లపోయాడు నిన్నటివరకూ 'ఏమండీ' అంటూ పిలిచిన స్వరాజ్యం వున్నట్టుండి పేరుతోపిలుస్తుంటే అదోలా ఫీలయ్యాడు తన తల్లి ఇలా తనకు తెలిసిన ఆడవాళ్ళంతా భర్తన్ని ఏమండీ అని మన్నిస్తూపిలవటమే అతనికితెలుసు

మరి రాజ్యం చదువుకున్నపిల్ల పోన్లే తననోటితో పేరుపెట్టి పిలుస్తేనేబాగుంది అనుకుని సమాధాన పడ్డాడు

''ఏమైనా బుక్స్ తెమ్మంటావా?" అన్నాడు

"ఉహు ఎన్ని పుస్తకాలైనా గంటలో చదివి పారేస్తాను తర్వాత? రోజంతా ఎట్లా?"

చాలా విచారం ధ్వనించింది రాజ్యం గొంతులో

అతను తల తిప్పి రాజ్యంవైపు చూశాడు

రాజ్యం అతని కళ్ళలోకి ఎంతెన కద్దున్నట్టు ప్రేమగా చూసింది

అతనిమనస్సు క్షణం వశంతప్పింది

చటుక్కున ఎడంచెయ్యి ఆమెనడుం చుట్టూ పోనిచ్చి దగ్గరకు లాక్కుని అందినచోటల్లా ముద్దుపెట్టుకున్నాడు

ఆనందంతో పారవశ్యంతో పులకించి పోయింది రాజ్యం

కొనగోటి స్పర్శతో నాదాలు వలికే వీణలావుంది ఆమె తనువూ, మనసూ

"మూర్తి ఈరోజు ఉండిపోరాదూ?"

అతని కప్పుడు టైము, డ్యూటీ గుర్తుకొచ్చాయి

రాజ్యాన్ని వొదిలేసి టిఫిన్ అందుకుని త్వరగా తినటం మొదలుపెట్టడు. 'ఎలా వీలవుతుంది' అంటూ

"ఎలా ఏమిటి? వీలు చేసుకుంటే అదే అవుతుంది"

"మన కాలక్షేపం కోసం ఎదుటి వాళ్ళని ఇబ్బంది పెట్టకూడదు రాజ్యం నీకు తోచకపోతే మళ్ళా టెంతుకికట్టు"

"ఉహూ నేను పరీక్ష తప్పించదవలేక కాదు ఇష్టంలేక"

అయితే మహిళామండలికి వెళ్లు కుట్లూ అదీనేర్చుకోవచ్చు లేకపోతే ఏవయినా పిండివంటలు చెయ్యి మీవాళ్ళ ఇంటికి వెళ్ళివస్తూండు"

అతను చెయ్యి కడుక్కున్నాడు

"పో నువ్వుచెప్పినవేవీ నాకునచ్చవు" అంటూ అతని తలను చేత్తో వెనక్కు నెట్టి లేచిపోయింది

అతను కుర్చీమీది తుండు అందుకుంటూ రాజ్యంవేపు ఆశ్చర్యంగా చూశాడు



తమిళ పాటలైతే - ఇంట్లో పిల్లకాయలు ట్యూను విని ఆనందిస్తారని, భాషా అర్థాలు నేర్చుకోకుండా

ఇంతకన్న ఏం కాలక్షేపం కావాలి?

అతని వుద్దేశం వుద్యోగాలు చెయ్యని ఆడవాళ్ళంతా తన తల్లిలా యింటి పన్లు చూసుకుంటూ వుంటారని.

రామ్మూర్తి తండ్రి బడిపంతులు. బడి అయ్యాక సాయంత్రాలు రావిచెట్టు కింద చప్టామీద కూచుని పిల్లలకి ప్రయివేట్లు చెప్పేవాడు. ఆతర్వాత కాసేపు అక్కడ చేరిన వాళ్ళతో కాలక్షేపం చేసి యింటి కొచ్చేవాడు.

రామ్మూర్తికి బడి, ఆటలు- సరి పోయేవి.

అతని తల్లి ఎప్పుడూ పాతబట్టలు కుడుతూనో, బియ్యం ఏరుకుంటూనో, యిల్లు బాగుచేస్తూనో పాదులు సరి చేస్తూనో కన్పించేది. అప్పుడప్పుడూ పంగవాళ్ళఇంటికివె శ్తే నలుగురైదుగురు ఆడవాళ్ళతో అప్పడాలు చేస్తూనో, ముచ్చట్లు చెప్తూనో కన్పించేది.

అతనికి రాజ్యం ధోరణి వింతగా తోచింది.

ం ం ం

రామ్మూర్తి గడ్డం చేసుకుంటున్నాడు అప్పుడే స్నానం చేసి వొచ్చిన రాజ్యం అతని దగ్గరగా వెళ్ళి,

మీసాలు పెంచితే నువ్వెంతో బాగుంటావు మూర్తీ ' పెంచుకోరాదూ" అంది.

వెనక నిల్చున్న ఆమెను ఒక్కసారి అద్దంలోంచిచూసి మళ్ళీ తనలో నిమగ్న మయ్యాడు మూర్తి,

'మా అత్తయ్య మీసాలులేని మగాడికి రోషం వుండదంటుంది'

నవ్వుతూ చెప్పిన రాజ్యానికి,

"అయితే నీకే మంచిదిగా" నవ్వుతూనే జవాబిచ్చి తుండు భుజానేసుకుని పెరట్లోకి వెళ్ళి పోయాడు.

రాజ్యం ముఖం ముడుచుకుని కూర్చుండి పోయింది.

పది నిముషాల్లో అతను స్నానం చేసి వొచ్చి బట్టలు వేసుకుని తయారవుతుంటే 'మూర్తీ ఆపొడుగు చేతుల చొక్కా ఆ పాంటు ఏమిటి? 'చక్కా బెల్ బాటమ్‌పాంటు వేసుకుని టక్ చేసుకుంటే బాగుంటావు, ఎంచక్కా అవి కుట్టించుకోరాదు' అంది అతన్నే చూస్తూ తల చిక్కు తీసుకుంటూ

'నేను చేసే వుద్యోగానికి షోకిల్లాలా తయారై వెడితే బాగోదు' మూర్తి వానీ ధరించి చెప్పుల్లో కాళ్లు దూర్చాడు

'ఏం' మీడాక్టరుగారు బెల్ పాంట్లూ బొమ్మల షర్టులూ వేసుకోవటం లేదూ?

అప్పటికే మూర్తి సైకిల్ గేటు దాటింది

రోజులు గడుస్తున్నాయి

అతనిలో అతని దిన చర్యలో మార్పు తేవాలని రాజ్యం ప్రయత్నిస్తూనేవుంది

అతను ఏరోజూ డ్యూటీకి ఆలస్యంగా వెళ్ళడు రాజ్యం వేళకు టిఫిను అందించక పోయినా 'పోనీలే అక్కడ నేనేదో తెప్పించుకుతింటాను. నువ్వు మాత్రం ఆకలితో వుండకు, ఏదన్నా చేసుకు తిను' అని చెప్పి వెళ్ళిపోతాడు

తాను వెళ్ళకపోతే అక్కడ పనులేవీ సరిగ్గా జరగవని అతని అభిప్రాయం నిజం కూడా అంతే అయిదారేళ్ళనుంచీ ఆ వుద్యోగంతో అతనికి అనుబంధం ఏర్పడిపోయింది

ఇరవై ఏళ్ళ రాజ్యం మనసు వేరు జలపాతంలా వురకలు వేస్తూ వుంది పుస్తకాలు - సినిమాలు వాటి తాలూకు అనుభూతులన్నీ వాస్తవంగా జరగాలనుకుంది

ఆరోజు రాజ్యం అభిమాన నటుడి సినిమా విడుదలయింది

సరిగ్గా నాలుగింటికల్లా తయారయి కూర్చుంది

అతను రాగానే టీ అందించింది

'ఈరోజు హాస్పిటల్ మానెయ్యి మూర్తీ సినిమాకువెళదాం'' అంది

''ఈరోజు డాక్టరుగారు వూళ్ళోలేరు రాజ్యం నేనుమానేస్తే ఎట్లా కుదుర్తుంది? నువ్వెళ్ళిరా'' అనేసి హడావుడిగా తయారై వెల్తూ ''డ్రాయరు సొరుగులో పర్సుంది, తీసుకో'' అని వెళ్ళిపోయాడు

అతన్నిగమనిస్తూ వుండిపోయిందిరాజ్యం అతను గేటు దాటాక కోపం, దుఃఖం పోటీలు పడ్డాయి

వెధవరోగాలు- మందులూ తనులేకపోతే అక్కడ గడవదన్నట్టు మాట్లాడ్తాడు. చేసేది మళ్ళా కాంపౌండరు ఉద్యోగం- ఇది ఎలాగైనా సరే మాన్పించాలి అనుకుంది నిరసనగా

మళ్ళా ఒకసారి ముఖం సరిగా చేసుకుని తాళం బిగించి రోడ్డుమీదికొచ్చింది ఎదురొచ్చిన రిక్షా ఆపి కూర్చుని 'నర్తకికి పోనియ్' అంది

o ooo o

ఆరోజు కావాలనే అతన్తో పోట్లాట వేసుకుంది

''ఇవ్వాళ ఏమీ తోచక ఎదురింటి ప్లీడర్ గారింటికి వెళ్ళాను. ఆవిడ మీ ఆయన ఏంపని చేస్తాడమ్మా అనిఅడిగితే చెప్పటానికి సిగ్గుతో చచ్చాను, మూర్తీ నువ్వా పాడుజాబు మానేసి పీ వూళ్ళో పొలం అమ్మేసి ఏదయినా బిజినెస్ పెట్టి బాగా సంపాయించుకోవచ్చు'' అంది



"కర్కశంగా, గరుకుగా ఉండే
పళ్ళపొడులు మీ పళ్ళకు,
చిగుళ్ళకు
హానికలిగించవచ్చు ..."

# కాల్గేట్ టూత్ పౌడర్‌తో మీ చిగుళ్ళను, చెడుశ్వాసను కూడా అరికట్టండి పళ్ళను కాపాడుకోండి.







కోల్గేట్ టూత్ పౌడర్ ఎంతో మెత్తగా ఉండే తెల్లని పౌడర్ అది అతి మృదువుగా మీ చిగుళ్ళను తోముతుంది అంతేగాకుండా దానిలో ఉండే సున్నితమైన మెరుగునిచ్చే పదార్థం మీ పళ్ళ మీది పాచిపొరలను తొలగిస్తుంది మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా చేస్తుంది కోల్గేట్‌లోని పుష్కలమైన నురుగునిచ్చే చర్య పళ్ళ సందులలోనికి చొచ్చుకుపోయి చెడు వాసనను దంతక్షయకారకములైన-సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది

మీ కుటుంబానికి కోల్గేట్ టూత్ పౌడర్‌తో అధునాతనమైన తీరులో దంతరక్షణ సమకూర్చండి దానియొక్క చల్లని పెప్పర్‌మెంట్ రుచిని వారంతా మెచ్చుకుంటారు




అప్పుడే భోంచేసి కుర్చీలో కూర్చున్న మూర్తి

"మా అమ్మా-నాన్నా బతికుండగా పొలం అమ్మటం కుదరదు రాజ్యం" అన్నాడు యధాలాపంగా

"పోనీ మా నాన్ననడిగి అప్పుతెస్తాను తర్వాత తీర్చెయ్యొచ్చు"

అతడు తనదారికివస్తున్నాడనుకుంది

"స్వరాజ్యం నువ్వేమనుకున్నా సరే నేను చేస్తున్న పనిమీద నాకు గౌరవం వుంది అందులో నాకు ఆనందంవుంది అది మానేసి ఏవ్యాపారమో చెయ్యమంటే నావల్లకాదు" పేపరు అందుకున్నాడు

మూర్తి అంత ఖచ్చితంగా చెప్పేసరికి రాజ్యం అభిమానం దెబ్బతింది

"అయితే ఎల్లకాలం ఈ కాంపౌండర్ ఉద్యోగమే చేస్తూంటావా?" కోపంగా అడిగింది

"ఆ ఏ పనీ అసహ్యించుకోదగినదీ చెయ్యకూడనిదీ కాదు పాకీపనితోసహా"

భర్తకేసి ఆశ్చర్యంగా అసహ్యంగాచూసి అక్కడ్నుంచి లేచివెళ్ళి విడిగా పక్క పరుచుకుంది ఇది జరిగాక రాజ్యం అతనితో మాట్లాడటం మానేసింది రెండ్రోజుల తర్వాత అలిగి పుట్టింటికి వెళ్ళిపోయింది రాజ్యానికిప్పుడునాలుగోనెల!

o o o o

రెండువారాలు గడిచినా రాజ్యం రాకపోయేటప్పటికి తనే మామగారింటికి వెళ్ళాడు మూర్తి,

ఆరోజు ఆదివారం సమయానికి చెంచయ్య ఇంట్లోనే వున్నాడు

మూర్తినిచూసి 'రావోయ్' అంటూ ఆదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టాడు

"అమ్మాయ్! మీ ఆయనొచ్చాడు కాఫీ పట్టుకురా అని కూతురికి చెప్పి అల్లుడితో మాటల్లోపడ్డాడు

చెంచయ్యకు మూర్తి అంటే చాలా

అభిమానం. మూర్తి యీ కాలపుకుర్రాడు కాదు. వేషధారణలో, ఎదుటి వాళ్ళతో మాట్లాడటంలో ఎంతో మర్యాద పాటి స్తాడు. ఒక్క దుర్గుణం కూడాలేదు

మాటల మధ్యలో రాజ్యాన్ని తీసు కెళ్ళాసికి వచ్చినట్లు చెప్పాడు మూర్తి.

చెంచయ్య లోపలికెళ్ళి కు తురతో ఆ మాట చెప్పివొచ్చాడు.

రెండు నిముషాల తర్వాత రాజ్యం ప్లేట్లో ఏవో టిఫిన్లతో వొచ్చి అతని ముందున్న టీపాయ్ మీద వుంచుతూ అతనికేసి చూసింది,

అప్పుడేమూర్తి రాజ్యంవంక చూశాడు

రెప్పపాటుకాలం రెండు జతల కళ్ళూ కలుసుకుని విడిపోయాయి.

రాజ్యం లోపలికి వెళ్ళిపోయింది.

అయిదు నిముషాల తర్వాత

చిన్న అటాచితో వచ్చి నిల్చున్న రాజ్యాన్ని చూసి లేచి నిలబడ్డాడు మూర్తి'

భోంచేసి వెళ్ళమని చెంచయ్య అంటూన్నా వొద్దని మర్యాదగా తిరస్క రించి రాజ్యంతో గేటు బయటికి వొచ్చాడు.

రాజ్యం మూర్తి పక్కన నిలబడి తండ్రికి వినిపించనంత మెల్లగా "మూర్తీ వెదరు చల్లగా హాయిగా వుంది సరదాగా మాట్లాడు కుంటూ నడిచిపోదాం" అంది

"నువ్వు వొట్టి మనిషివి కాదు. ఒక్క క్షణము వుండు. యిప్పుడే వస్తా" అని రయ్యన సైకిల్ మీద వెళ్ళి రిక్షా తెచ్చాడు

రాజ్యం ఒక్కసారి అతని కేసి చూసి రిక్షా ఎక్కి కూర్చుంది.

రిక్షా ముందు- అతని సైకిలు వెనుక వెళుతూంటే గేటు బయట నిల్చుని చూస్తూన్న చెంచయ్య "నా బిడ్డని సుఖ పెట్టేవాడి చేతుల్లోనే పెట్టాను" అనుకు న్నాడు తృప్తిగా.

ఆరోజు రాత్రి రాజ్యం కబుర్లు వింటూ చాలా సేపు మేలుకుని వున్నాడు మూర్తి.

భర్త సాన్నిధ్యం లో పాత కోపాన్ని మరచి పోయింది రాజ్యం

ఆరాత్రి చాలా తొందరగా గడచి పోయినట్లనిపించింది ఇద్దరికీ

రోజులు గడుస్తున్నాయి రెండు రోజులు సరిగ్గా వుంటే మూడో రోజు ఏదో విషయం అలిగి కోపగించుకుని ముభావంగా వుండి పోతుంది రాజ్యం.

"రాజ్యం! నువ్వెందుకు ఎప్పుడూ ఎలాగో వుంటావు" అడిగాడు ఒకరోజు.

"ఎలా వుంటాను ?

"ఏమో. నాకు సరిగ్గా చెప్పటంరాదు. డల్ గా ఏదో పోగొట్టుకున్న దాని లాగా"

రాజ్యం చురుగ్గా అతని వైపు చూసింది.

"నిన్న సినిమాలకీ షికార్లకీ తీసు కెళ్ళడం లేదని కోపం కదూ. నువ్వే చెప్పు. నాకు తీరికెక్కడ రాజ్యం. చాలా సార్లు ఆలోచించాను. నీకోసం యీ ఉద్యో గం మానేసి నువ్వు చెప్పినట్లే వ్యాపారం పెడదామని. అప్పుడు మాత్రం తీరిక వుంటుందంటావా? బాధ్యత యింకా ఎక్కువవుతుంది. పైగా ముక్కు సూటిగా పోయే నాలాటివాడు వ్యాపా రంలో రాణించలేడు. మోసాలూ జిత్తులూ వుంటేగానీ వ్యాపారంలో రాణించలేం. అవన్నీ నావల్లకాని పనులు రాజ్యం.

ఒక రకంగా నేనీ వుద్యోగానికి బందీనై పోయాను. ఆవాతావరణం నాకు అతికి నట్టుగా సరిపోయింది. ఏరోజూ ఎనిమిదయే సరికి డాక్టరు గారికి విష్ చెయ్యక పోతే ఏమిటో వెలితిగా వుంటుంది. అతను చాలా మంచి మనిషి. దేవుణ్ని నమ్మడు కాని నామీదెంతో విశ్వాసం. ఆవిడకూడా చాలా మంచావిడ.

అతని మాటలకు రాజ్యం అడ్డుతగిలి "ఆవిడకేం తక్కువ. కావలసినంత డబ్బుంది. మొగుడు డాక్టరు. బాగా సంపాదిస్తున్నాడు. ఇంకా ఏం" అంది.

"రాజ్యం డబ్బొక్కటే సుఖాన్నిస్తుందనుకుంటున్నావా. ఆవిడకి డబ్బుందన్న గర్వం ఏ కోశానా లేదు. ఎప్పుడో తప్ప యిల్లు కదలదు. పుస్తకాలతో కాలక్షేపం చేస్తుందట డాక్టరుగారే చెప్పారు. "ఆవిడ సహకారం లేకుంటే నేనింత వాణ్ని అయ్యేవాణ్ని కాదు మూర్తి నేను యింతగా ఎదిగానంటే అందుకు నాభార్య కొంత కారణం" అంటారు.

రాజ్యం మాట్లాడలేదు.

"రాజ్యం. నామీద మాటిమాటికీ అలక్కు. నా సంపాదన నాది. నేనే నీ వాణ్ని. ఏది కావాలన్నా కొనుక్కో. నా పర్మిషన్ అవసరంలేదు. నేనింట్లో వున్న కాస్సేపూ నన్ను సంతోషపెడ్తూ నువ్వు సంతోషంగా వుండు. ఏం?" అంటూ రాజ్యం వొళ్ళో తలపెట్టుకుపడుకున్నాడు

రాజ్యం మౌనంగా ఆలోచిస్తూ వుండి పోయింది.

o o o o

నెలరోజులు సాఫీగా గడిచిపోయాయి. ఉదయం— మూర్తికి డ్యూటీ వేళయింది. పెన్ను కనిపించలేదు. డ్రాయర్లు జేబులూ డ్రాయరు పొరుగులూ వెతుకుతూ "రాజ్యం నా పెన్ను చూశావా?" వంటింట్లోకి రాజ్యానికి వినపడేలా అడిగాడు.

బదులు రాలేదు రాజ్యం ఆ గదిలోకి రాలేదు,

వెళ్ళేహడావుడిలో వాచీచూసుకుంటూ 'స్వరాజ్యం'-'స్వరాజ్యం' అంటూ గట్టిగా పిల్చాడు.

"విసురుగా—సుడిగాలిలా గదిలో కొచ్చింది రాజ్యం."

"అరవకండి—ఇంత గట్టిగా—నాలు గిళ్ళకి వినపడేలా స్వరాజ్యం, స్వరాజ్యం అంటూ. ఛ. పిలవటంకూడా నాజూకు, అందం తెలీదు. వొట్టి సంగి"—

ఒకక్షణం ఆగి తెల్లబోయి చూసి, అంతలో పేపరుకింద కన్పించిన పెన్ను జేబులో పుంచుకొని హడావుడిగా గేటు దాటాడు మూర్తి.

గది మధ్యలో నిలబడిపోయింది రాజ్యం.

ఎన్నిమాటలన్నా, రెచ్చగొట్టినా అతను ఏమీ అనడు. అది నిర్లక్ష్యమో మంచి తనమో అర్థంకాదు రాజ్యానికి.

గంట తర్వాత బట్టలుసర్దుకుని రిక్షా మాట్లాడుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది-

రోజులు వాటంతట అవే గడుస్తున్నాయి.

రాజ్యం అలా వెళ్ళిపోవటం, తిరిగి తీసుకురావటం ఇద్దరికీ అలవాటయింది.

వెంకయ్య మాత్రం 'అతని మంచి తనాన్ని అలుసుగా తీసుకుని నువ్వుమాటి మాటికీ రావటం బాగోలేదమ్మా' అని మందలించాడు. సంసారంలో అభిమా

నాలూ కోపాలూ పనికితావు సర్దుకుపోవాలని నచ్చచెప్పాడు

రాజ్యం లెక్క చెయ్యలేదు

మళ్ళా ఒకరోజు ఏదో విషయంలో తగాదా పెట్టుకుని పుట్టింటి కొచ్చింది ఆ రావటం రావటం, మళ్ళా తిరిగి మూర్తి ఇంటికి అయిదునెల్ల బిడ్డనెత్తుకుని వెళ్ళింది

ఇప్పుడు రాజ్యానికి బిడ్డతోటిదే లోకం కూతురే సర్వస్వం రోజులు దొర్లిపోతున్నాయి తన రెండేళ్ళ సంసార జీవితాన్ని సింహావలోకనం చేసుకున్న రాజ్యం నిట్టూర్చింది గట్టిగా, ఎదుటివాళ్ళ కష్టసుఖాలతో పోల్చుకున్నప్పుడే తనెంత సుఖపడుతున్నదీ అర్థమవుతుంది.

మనిషి నైజం చిత్రమైనది ప్రతిమనిషీ ఎదుటి వారిని అంచనా వెయ్యటానికి, పరిశీలించటానికీ తనతో పోల్చి చూసుకోవటానికీ ప్రయత్నిస్తూ వుంటాడు. అయితే ఒక్కటి మాత్రం నిజం. ఎదుటి వారిని చూస్తూ కూడా తప్పొప్పులు సరి చేసుకునే ప్రయత్నం ఏ ఒక్కరూ చెయ్యరు. వారంరోజులక్రితం వరకూ రాజ్యం బాగానే వుంది. ఒకరకంగా ఆ జీవితానికి అలవాటుపడిపోయింది కూడాను

పదిరోజులక్రితం—పక్కన ఖాళీగా వున్న వాటా తలుపులు తీయించి శుభ్రం చేయించాడు ఇంటిగలాయన అందులోకి దిగారు సుందరీ సుబ్బారావూను

వాళ్ళ సరసాలూ సరదాలూ చూస్తున్న రాజ్యం గుండెల్లో అణగారి నిద్రాణమై వుండిపోయిన కోరికలూ ఆలోచనలూ మళ్ళీ తలెత్తసాగాయి తనెంత నిస్సారమైన సంసార జీవితం గడపుతూవుందో అర్థమైంది

ఒక్క నిట్టూర్పువిడిచి వాళ్ళ పిరుచుకుంటూ గడియారంవైపు చూసింది 7 గంటలు కావస్తూంది లేచి పిల్లకిపాలు కలుపుకొచ్చింది నిద్రలో కదులుతున్న పిల్లని లేపి పాలు తాగించి, కాసేపు అటూ ఇటూ తిప్పి నిద్రపుచ్చింది,

పిల్లపక్కన చాప మీద కూచుని కుప్పగా పడున్న పూలకేసిచూస్తూండి పోయింది.

సన్నజాజి మొగ్గలు తమ సహజ పరిమళాల్ని వెదజల్లుతూ విచ్చుకుంటున్నాయి

మోకాళ్ళమీద గడ్డం ఆనించుకుని కొన్ని క్షణాలు కూర్చున్న రాజ్యం మంత్ర ముగ్ధలా లేచింది

దారంపుండ తెచ్చుకుని పూలముందు కూచుంది.

మాల కట్టటం అయ్యాక గదంతా ఒకసారి కలయ జూచింది

చేతిలో పూలచెండు టేబుల్ మీదవుంచి మంచంమీది దిండు కవరూ దుప్పటీతీసి ఇస్త్రీచేసిన దిండు కవరూ, దుప్పటి వేసింది

టేబులు మీద పుస్తకాలు చక్క సర్దింది

గదిలో అస్తవ్యస్తంగా వస్తువుల్ని పాత అట పస్తువుల్ని యథాస్థానాల్లో వుంచింది

పెట్టెలోంచి తెల్ల గ్లాస్కో ప్రింటు వాయిలు చీర బ్లవుజు తీసుకుని ముఖం కడుక్కుందామనుకున్నదల్లా స్నానం చేసి వచ్చింది

అద్దం ముందు పావు గంట సేపు ముస్తాబయ్యింది



టేబుల్ మీద పూల చెండు ఒక్కసారి తనివి తీరా ఆఘ్రాణించి జడలో అలంకరించుకుంది

ముస్తాబు పూర్తయ్యాక ట్రాన్సిస్టర్ ఆన్ చేసింది

బాలసుబ్రమణ్యం పాట వస్తోంది వుషారుగా సీకనలక్కుండా మ చం ా ర కూర్చుని గడియారంకేసి చూసింది ఎనిమిదిదాటి పది నిమషాలయ్యింది ఇంకా గంట ఆగకంది పత్రిక అందుకుని పేజీలు తిప్పసాగింది

ఓ పేజీలో వెన్నెల కురిసిన వేళ కథకు వేసిన బొమ్మను చూస్తుండిపోయింది

ఆమె వివస్త్రగా కూర్చుని స్నానం చేస్తూవుంది యింటి వెనక చుర ుగ్నెట్లో హటాత్తుగా అక్కడికి కొచ్చిన యువకుడు చూపు మరల్చుకోవటంమర్చి సభ్యత మర్చి చూస్తున్నాడు

పేజీలు తిప్పింది గాలో ఎగిరి పోతున్నారు యిద్దరూ చెట్టా పట్టాలు వేసుకుని

స్వేచ్ఛ కథ పేరు అనుబంధాలు సీరియల్ నవల కోసం వేసిన బొమ్మలో యిద్దరూ హత్తుకుని కూర ని వున్నారు

తలగడకు ఆనుకుని పేజీలు తిప్పుతూంది

తలుపు కొట్టిన చప్పుడు

దిగ్గున లేచి వెళ్ళి తలుపు తీసింది ఎదురుగా మూర్తి

నవ్వుతూ అతని వైపు చూసింది

ఒక్క క్షణం ఆగిపోయి చూశాడతను

ఆమె చూపులు మరల్చుకుని కదలబోయింది

రాజ్యం పిల్చాడు

ఆమె ఆగిపోయి అతని వైపు చూసింది

(సశేషం

# నిర్భయత్వానికి, నిత్య నూతన రచనాశక్తికి నిదర్శనం గోరాశాస్త్రి

తెలుగు పత్రికా రంగంలోని నిర్భయుడు నిజాయితీతో హృదయస్పందన కలిగి వ్రాసే శక్తిమంతుడ, స్వతంత్ర భావాలతో తొణికిసలాడే ఆలోచనాపరుడు గోరాశాస్త్రి. ఆయన మరణం పత్రికా రంగానికే కాక, సాహితీలోకానికి కూడా తీరని నష్టం.

గోరాశాస్త్రి స్వతంత్ర సంపాదకుడుగా ఒక విశిష్టత సంతరించుకున్నారు. ఆయన ఎన్నిక చేసిన కవితలు – ముఖ్యంగా రెండవ పేజిలో ప్రచురింపబడేవి. ప్రత్యేక ప్రాధాన్యతతో అందరూ పరిశీలించేవారు. నేడు ప్రతిష్టగల మహాకవులు చాలామంది గోరాశాస్త్రి స్వతంత్ర నుండి వెలికి వచ్చినవారే. రాజకీయ సాంఘిక విషయ అవగాహన, వాటిపై గోరాశాస్త్రి నిర్భయ భావ ప్రకటనలు సంచలనం కలిగించేవి రాజకీయవేత్తలు ఆయన అభిప్రాయాలతో ఏకీభవించినా లేకపోయినా గౌరవించేవారు.

రేడియో నాటక రచయితగా గోరాశాస్త్రి రచనల్లో కలం పదునుతనంతో పాటు, వ్యంగ్య చిత్రం ప్రతిబింబించేది. వస్తుదృశ్యము రూపొందించడంలో ఆయనకు ఆయనేసాటి, ఆనంద నిలయం నెలవుల్లో గోరాశాస్త్రి కలంనుండి వెలువడిన ఉత్తమ రచన,–'ఆశ ఖరీదు అణా' దృశ్యనాటకంగా కూడా రూపొందించి వంద పైగా రేడియో నాటికలు



గోరాశాస్త్రి వ్రాశారు. మధ్యతరగతి జీవనంలోని చెరగని మలినరేఖలు స్పష్టంగా చిత్రించి పాఠకులలో ఆవేదన కలిగించి ఒక క్రొత్త లోకం సృష్టికి దోహదం చేసే కలం తీరు ఆయనలోని ఆకర్షణ.

62 వసంతాలు చవిచూచి, పత్రికా సాహితీ రంగాలలో ఒక ధ్రువ తారగా నిలచిపోయాడు గోరాశాస్త్రి.

–పోతుకూచి సాంబశివరావు

# నువ్వంటే నాకెంతో ఇష్టం!

## దమయంతి

పదిన్నరయింది ఆఫీసులో అడుగు పెడుతూ చూశాను. నీలంచీరమ్మాయి.

మేనేజరుతో మాట్లాడుతోంది ఎదురుగా కూర్చుని. ఆశ్చర్యమో ఆనందమో తెలీని స్థితిలో నా కాళ్ళు ఆగాయి. ఆ అమ్మాయిని వెనకనుంచిగానీ పక్కనుంచిగానీ వెయ్యిమందిలోనైనా చూసి పోల్చుకోగల సాన్నిహిత్యం నాకుంది. ఆ అమ్మాయిని అలా చూసిన క్షణం నా కళ్ళలో మెరిసిన మెరుపుని నేనైతే చూడలేదుగానీ గ్రహించాను.

ఆరునెలల తర్వాత మళ్ళీ ఇక చూడలేనేమో అనుకొంటున్న సమయంలో చూసినప్పుడు నాలో కలిగిన ఉద్వేగాన్ని ఆపే శక్తి నాకు లేకపోయింది.

"ఏం బ్రదర్ అలా చూస్తున్నావ్, మేనేజరుగానీ ముద్దిస్తున్నాడా?" అటుగా వస్తూ అన్నాడు కుమార్ - అతనికి నా దగ్గర చనువుంది.

"అదేం కాదుగానీ ఎవరా అమ్మాయి?" అన్నాను కుమార్ అటుకేసి చూశాడు,

"బాగుంది కదూ?" రహస్యంగా అన్నాడు.

"నోర్మూసి అసలు విషయం చెప్పు"

"కొత్త క్లర్కు. ఈరోజే చేరింది" చెప్పాడు.

"మన ఆఫీసులోనే!?"

"అక్షరాలా"

"హౌనైస్" నాలో నేనే అనుకొంటున్నట్టుగా అన్నాను.

"నీకుగానీ తెలుసా ఆ అమ్మాయి?" అడిగాడు కుమార్ నన్ను.

"ఊ" అనబోయి "ఆమె తెలీదు" అన్నాను.

"పేరేమిటి?"

"తెలీదింకా ఉండు -- కనుక్కొస్తా" కుమారు అదేపనిమీద వెళ్ళాడు.

సీటు దగ్గరకి నడిచాడు. నమ్మలేకపోతున్నాను. కానీ కళ్ళకెదురుగా కనబడుతుంటే నమ్మకుండా ఎలా ఉండటం?

ఆ అమ్మాయిని మొదటిసారిగా నీలం రంగు చీరలో చూశాను. చిన్నప్పటినుంచీ నాకు ఆ రంగటే చిరాకు. అటువంటిది ఆ అమ్మాయిని ఆ రంగు చీరలో చూడగానే నీలం రంగుకి ఇంత అందముందా అనిపించింది. ఆలోచించగా అది ఆ అమ్మాయి కట్టుకున్నందువల్లే అని తెలిసింది.

సీట్లో కూర్చున్నాను గానీ ఏ పనీ తోచడంలేదు. లేచి టాయిలెట్‌కేసి నడిచాను. అద్దంలో చూస్తూ తల దువ్వుకొని బయటికి వచ్చాను

నా గుండె ఓ క్షణం ఆగినట్టుంది. ఆ అమ్మాయి నాకేసి చూసింది.

ఆగిన గుండె పెరిగి అతివేగంగా కొట్టుకోడం నాకు స్పష్టంగా తెలస్తోంది.

"ఎందుకిలా నావెంట పడతావ్?"

ఆ అమ్మాయి వేసిన ప్రశ్నతో నాకు లోకం తెలిసింది. సర్దుకున్నాను

"నేనా!?" అన్నాను అయోమయంగా

"అవును" అంది తడుముకోకుండా.

ఆ అమ్మాయి బింకంచూస్తే ఏడిపించాలనిపించింది.

"మరొకరెవరూ పడకుండా" అన్నాను నవ్వుతూ.

"షటప్"

".. .."

"చూడు నిన్ను చూస్తే నా కసహ్యం"

"కానీ నాకుమాత్రం ఆ అభిప్రాయం లేదు" అన్నాను.

"దయచేసి నావెంట పడకు" అని చాలా పొగరుగా అంది.

"దయచెయ్యక పోతే?" కావాలనే అడిగాను.

"ఏం చెయ్యాలో నాకు తెలుసు."

"ఓ. కె. ప్రొసీడ్ వెన్. ఆల్ ది బెస్ట్".

రుసరుసలాడుతూ వెళ్ళి పోయింది. ఏదోఒకటి మాట్లాడుతూ ఆ అమ్మాయిని ఆపాలనీ దాంతో ఆమెని మరి కాస్సేపు దగ్గరగా చూసే అవకాశం ఉంటుందనీ చేసిన నా ప్రయత్నం ఫలించలేదు.

ఎంతో మంచిగా మాట్లాడాలను కొన్న నా నిర్ణయాల్ని ఆ అమ్మాయి మాటతీరు మార్చేస్తుంది. ఆమె గొంతులో ధ్వనించే పొగరు నన్ను మొండిగా ప్రవర్తించేలా చేస్తుంది అది నా బలహీనత కావచ్చు.

సీట్లోకొచ్చి కూర్చున్నాను కుమార్ వచ్చాడు హడావిడిగా

"గురూ ఆ అమ్మాయి పేరు తెలిసింది" అన్నాడు

"ఏవిటి" నాలో ఆసక్తి నాకు తెలీకుండానే బయట పడింది.

"చెబితే ఏమిస్తావ్?" అదేదో పెద్ద విషయం అన్నట్టు ఊరించాడు నన్ను

"నీ బొంద నీకివ్వడ మేమిటి నువ్వు చెప్పక పోయినా తెలుస్తుంది" అన్నాను

"అదీ నిజమే. కాబట్టి నేను చెప్పడమే మంచిది ఆ అమ్మాయి పేరు అనురాధ" అన్నాడు. అని నా మొహంలోకి చూసాడు

"సరే. పోయి సీట్లో కూరో - మేనేజర్ చూస్తున్నాడు" అన్నాను. కుమార్ వెళ్ళి పోయాడు.

అనురాధ! అందానికి తగిన పేరు కానీ ఆ గర్వం ...

జేబులోంచి పాకెట్ డైరీ తీసి మొదటి పేజీలు తిప్పాను, ఇదెలా సాధ్యం? అంతు బట్టడంలేదు అలా ఎంత సేపు కూర్చున్నానో తెలీదు.

"సార్ మేనేజరు పిలుస్తున్నారు" ప్యూన్ చెప్పాడు-వినిపించింది.

పావు గంట తర్వాత తిరిగొచ్చి సీట్లో కూర్చున్నాను. టేబుల్ పైన కాగితాల కదుల్తున్నా ఆలోచనలు వదలడం లేదు.

అనురాధని మొదటిసారి 123 నెంబరు బస్‌లో చూశాను నిర్మల్ ఇండస్ట్రీ స్టాపులో ఎక్కి కోఠి సర్కిల్ దగ్గర దిగిపోయింది. ఆ అమ్మాయిని చూసిన మొదటి క్షణం నా మనసు ఇదీ అని చెప్పలేని ఓ స్థితికి చేరుకుంది పరిసరాలని మర్చిపోయి ఆ అమ్మాయిని కళ్లార్ప



కుండా చూశాను బస్ దిగేవరకూ. నేనలా
చూడటానికి కారణం ఆ అమ్మాయి
అందమే అని చుట్టుపక్కల వాళ్ళు అను
కొన్నా, ఆ అభిప్రాయాన్ని అవుననీ
కాదనీ అనగలిగే స్థితిలో లేను నేనప్పుడు.
ఆ అమ్మాయిని చూసినప్పుడల్లా రోజూ
ఇదే పరిస్థితి ఎదురైంది నాకు.
ఆ అమ్మాయికి విడవకుండా ఎప్పుడూ

అంటిపెట్టుకుని తిరిగే ఓ స్నేహితురాలు ఉంది. గర్వం కేవలం మా ఇద్దరి సొత్తు అన్నట్టుగా ఉండేది వాళ్ళ ప్రవర్తన బస్‌లో. అందమూ, గర్వమూ ఒకేచోట కలిసి ఉంటాయన్నమాట వాస్తవమైతే ఆ అమ్మాయి అందగత్తెననీ, ఆ అందగత్తెకి గర్వం ఆభరణమనీ ఒప్పుకుని తీరాలి.

అదే నాకు బాధకలిగించిన విషయం. ఆ అందమైన నల్లని కళ్ళలో పొగరుకి బదులుగా వినయం తొంగిచూస్తే .. అనుకొంటాను నేనిప్పటికీ. ఆమెకి నేనుగుర్తున్నాననీ నేనంటే తనకి కోపమనీతెలుసు. అందుకు నేనేం చెయ్యాలి?

ఆమెని చూడకుండా, చూస్తే, మాట్లాడకుండా ఉండలేని నా బలహీనతని ఎలా దారికి తేవాలి?

రోజూ బస్‌లో మూడోసీటు దగ్గర నిలబడి తనని చూస్తుండటం ఆమెకి తెలుసు. దానికి సూచనగా మొహంలో చిరాకు స్పష్టంగాకనిపించేది. నా గురించి స్నేహితురాలితో ఏదో చెప్పడమూ ఆ పిల్ల తలతిప్పి నాకేసి చూసి నవ్వుతూ ఏదో అనడం అన్నీ నాకు తెలుసు. ఆమె నా పట్ల చూపే విముఖత కొద్దిరోజుల్లోనే నాకు అర్థం అయినా నా ప్రవర్తనలో మార్పు రాకపోవడం నాకే ఆశ్చర్యాన్ని కలిగించేది.

ఆ రోజు బస్‌లో ఎప్పటిలా నుంచున్న నేను ఆమె పుస్తకాల మధ్య నుంచి ఏదో జారిపడటం గమనించాను. అందుకని చూశాను. బస్‌పాస్. విమన్స్ కాలేజీలో బిఎస్సీ చదువుతోందని తెలిసింది, పేరు చూసేంతలో ఆమె చూసింది. ప్రపంచంలో వున్న అసహ్యాన్నంతటినీ తన మొహంలోకి ఎరువు తెచ్చుకుందా అనిపించింది నాకా క్షణంలో.

"ఇది మీదే అనుకుంటాను... "

నా మాట పూర్తికాకముందే నా చేతిలోని బస్‌పాస్‌ని దాదాపులాక్కున్నట్టుగా తీసుకుంది. కనీసం థాంక్స్‌యినా చెప్పకుండా గభాల్న అటుతిరిగి నుంచుంది

నేనొక జులాయి వెధవననీ తనని గమనించడమే నాపని అనీ ఆమె అభిప్రాయం దానికి తగినట్టుగా బస్‌లోనే కాకుండా విడిగా మేమిద్దరం అక్కడక్కడ తారసపడటం జరిగేది. ఇద్దరం ఒకేరూట్‌లో ఉండటం కారణం కావచ్చు.

ఓ ఆదివారం సాయంత్రం ఏడు గంటల ప్రాంతంలో సుల్తాన్‌బజార్ దగ్గర బస్టాండులో నుంచున్న నాకు ఆమె కనిపించింది.

ఒంటరిగా ఆ సమయంలో అక్కడ చూడడంతో ఆశ్చర్యంతో పాటు ఆనందమూ కలిగిన మాట నిజం.

ఆమె నన్ను చూసింది, ఓ క్షణం ఆగి తిన్నగా నా దగ్గరకొచ్చింది. ఆమె ధైర్యం ఆక్షణంలో నా కర్థం కాలేదు

"చూడు మిస్టర్. ఆడపిల్లల వెనక పడటం తప్ప నీకేం పన్లేదా?"

ఈసారి నిజ గానే ఆశ్చర్యపోయాను. అంతలో నాకో సందేహం కలిగింది. మాఇద్దర్లో ఎవరికి వెనక ఎవరు పడుతున్నాం అని. ఆమె మొహం చూస్తే

నవ్వొచ్చింది నాకు ఉడికించాలని పించింది.

"ప్రస్తుతానికదే పని" అన్నాను.

రోషంగా చూసింది నాకేసి.

"జాగ్రత్త, త్వరలో మరో పని తగలొచ్చు హాస్పిటల్లో" అని అక్కడ మరో క్షణం నిలవకుండా జనంలో కలిసి పోయింది.

ఆమె చూపులో, మాటలో ఎంత గర్వముందో ఆ నడకలోనూ అంతే గర్వ ముందనిపించింది ఆ క్షణంలో ఆమెని చూస్తే. అయితే సిటీలో ఒంటరిగా తిరిగే ఆడపిల్లకి ఆ మాత్రం ధైర్యం ఉండటం అవసరం అని కూడా అనిపించింది.

కానీ పరీక్షలు అయిపోయి ఆమె బస్‌లో రావడం మానేసిన రోజున నా మనసు పడిన అవస్థ నాకీ రోజుకీ గుర్తుంది.

అనురాధని మళ్ళీ ఇలా చూస్తానని అనుకోలేదు. ఆఫీసులో ఆమెని చూసినప్పుడు మొదటనే నెంత ఆశ్చర్యపోయానో నన్ను చూసి అనురాధ కూడా అంతే ఆశ్చర్యపడి వుండాలి

"నీకీ విషయం తెలుసా?"

లంచ్ అవర్లో కుమార్ అన్నాడు నాలుగు రోజుల తర్వాత

"ఏ విషయం?" అన్నాను ఏమీ పట్టనట్టుగా

"అనురాధకి పెళ్ళయిందన్న విషయం".

"వ్వాట్? నిజంగా!" ఈసారి నా ఆసక్తిని ఆపలేక పోయాను. అనురాధ మొహం చూడటమే తప్ప మిగతావి

వట్టించుకోనందుకు నన్ను నేను తిట్టు కున్నాను.

"అలా ఆశ్చర్య పోతున్నావ్ నీకే మాత్రమైనా ఆశ వంటిది ఉందేమిటి. ఎందుకైనా మంచిది అలాంటివేం పెట్టు కోకు. ఆవిడి కసలే ముక్కు మీద కోపం-ఆపైన బోల్డంత గర్వం"

అనేసి సమాధానంకోసం చూడకుండా వెళ్ళిపోయాడు కుమార్.

అయితే కుమార్ చెప్పిన ఈవిషయం కూడా నాలో మార్పుని తేలేకపోయింది.

ఎందుకు నేనంటే ఆమెకంతకోపం? ఏమిటి నేను చేసిన నేరం? నాకేసి ఎందు కంత చిరాగ్గా జూస్తుంది?

ఒక్కొక్క మనిషిని చూస్తే ఒకొక్క రకంగా అనిపిస్తుందికాబోలు. అది నా అదృష్టమూ ఆమె దురదృష్ట మూనా?

ఆరోజు అనురాధ ఆఫీసుకి రాలేదు. రోజూ అనురాధని చూడటం అలవాటై ఆమె కనబడక పోతే మనసంతా అదోలా ఏమీ తోచక పిచ్చిపట్టినట్టుగా ఉంది. మర్నాడు ఆమె రాక కోసం చూస్తూహాల్లో నుంచున్నాను. గుమ్మంలో ఎదురైంది అనురాధ.

"ఏమిటలా చూస్తావ్?" చీదరించు కున్నట్టుగా అంది.

"మీ మొహాన్ని" అన్నా టక్కున. ఆమె వాలకం నేను ఏం మాట్లాడుతు న్నానో తెలీకుండా చేస్తోంది.

"పిచ్చిగా వాగకు. తల్చుకుంటేనిన్ను ఏమైయినా చెయ్యగలను" అంది.

"సంతోషం. అంటే నన్నింకాతల్చుకో లేదన్నమాట".

"ఛీ! ఇక్కడ కూడా నీ మొహం ఎదురవుతుందనుకొంటే అసలీ ఉద్యో గంలో చేరేదాన్ని కాదు" అంది ముందుకు నడుస్తూ.

"ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదు. వదలిపెట్టవచ్చు."

ఆగి చురుక్కున చూసింది. తర్వాత అంది.

"నీలాంటి వాడికి భయపడేంత పిరికి దాన్ని కాదు"

"నాకు తెలుసా సంగతి."

"ఏమిటి?"

"మీ ధైర్యం గురించి"

"ఇంకా తెలుసుకోవల్సింది చాలా వుంది. ఇప్పుడు నన్ను రక్షించుకోడానికి మరో మనిషి వున్నారని గుర్తుంచుకో" అంది.

"తప్పకుండా. కానీ పొరపాటున ఎప్పుడైనా మర్చిపోతే?" ఆమెతో పాటు ఓ అడుగు ముందుకి వేస్తూ అన్నాను.

"అనుభవిస్తావు" చరచరా వెళ్ళి పోయింది.

ఆ మొహంలో ఎంతకసి, ఎంత ద్వేషం! ఏమిటి నేను చేసిన పాపం?"

వారంరోజుల తర్వాత -

ఆఫీసు నుంచి బయటకొచ్చి నడుస్తు న్నాను. పని ఎక్కువగా ఉండి లేట యింది, అలసటగానూ చిరాగ్గానూ ఉంది. పది నిముషాలు నడిస్తేగాని బస్టాప్ రాదు

"ఎయ్ మిస్టర్"

ఎవరో పిలిచారు వెనక్కి తిరిగి చూశాను. ఎవరూ లేరు. తిరిగి నడక సాగించాను.

"నినే"




ఆగి పక్కకి చూశాను

అతను నాకేసే వస్తున్నాడు అతన్ని దివరకు ఎక్కడా చూసినట్టు లేదు ఎవరై ఉంటాడు అని ఆలోచిస్తున్నాను

"గంగాధర్ నువ్వేనా?"

అతని ముఖంలోకి పరీక్షగా చూశాను గుర్తురాలేదు

"అవును మీరెవరు?" అన్నాను

"నేనెవరో తర్వాత తెలుస్తుంది ముందు పద" అన్నాడు నడుస్తూ. నేను అనుసరించాను నడుస్తూ

"నీకు తల్లి తండ్రులున్నారా?" అడిగాడు

"లేరు" అతని గురించి ఆలోచిస్తునే చెప్పాను

"పెళ్ళాం పిల్లలు?"

"ఊహూ" అతన్ని గురించే అంచనా వేయడానికి ప్రయత్నిస్తున్నాను.

"అన్నదమ్ములు, అక్క చెల్లెళ్లు?"

"ఎవరూ లేరు"

"అందుకే పిచ్చి వేషాలేస్తున్నావా?" సూటిగా నాకేసి చూస్తూ అన్నాడు.

"అంటే?"

"నిన్ను పడేసి తన్నినా నీగురించి ఏడ్చేవాళ్ళూ పట్టించుకునే వాళ్ళూ లేరని వెర్రి వేషాలేస్తున్నావా అని" తీక్షణంగా చూశాడు నాకు అర్థం కాలేదు

"ఏమిటి నీతో మాట్లాడటం?" అన్నాను

"కాదోయ్ ఆడపిల్లల్ని అల్లరి పెట్టడం" అన్నాడు

ఎవరై ఉంటాడితను? అనురాధ నాపైకి పంపించి ఉంటుందా? నాలో తెగింపు చోటు చేసుకుంది

"నా ఇష్టం, అడగటానికి నువ్వెవరు?" అన్నాను మొండిగా

"నీ ఇష్టమూ. అయితే ఇది నా ఇష్టం" అంటూ మరో మాటకోసం ఆగకుండా అరచేత్తో నా దవడ పగిలేలా కొట్టేడు. తేరుకొనేలోగానే ఎడంచేత్తో కాలర్ పుచ్చుకుని మొహంపైనా భుజాలపైనా ఎడాపెడా కొట్టేశాడు. నాకు కళ్లు తిరిగినట్ట

ఉయింది. ఒళ్ళు తూలుతుంటే పడకుండా నిలదొక్కుకునే ప్రయత్నంచేశాను.

"జాగ్రత్త మళ్ళీ రాధ జోలికొచ్చావా ఇంతకంటే ఘనంగా సన్మానిస్తాను నిన్ను" అని జరిగింది నేను అర్థంచేసుకొనేలోగానే గబగబ అడుగులేస్తూ వెళ్ళిపోయాడు

అప్పుడు చూసుకున్నాను నా ముక్కునుంచి రక్తంకారుతోంది కన్ను అప్పటికప్పుడే వాచిపోయి కనిపించటం మానేసింది ఎముకలన్నీ పిరగొట్టినట్టు బాధగా ఉంది. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. కొంతదూరం నడచి ఆటోఎక్కి రూంకి చేరుకున్నాను.

o o o o

అమీర్‌పేటలో బస్సుదిగి నాగార్జున నగర్ కాలనీకి వెళ్ళాను. నన్ను చూడగానే సరళ ఆంటీ చిన్నబుచ్చుకుంది మొహాన్ని

"ఏం బాబూ, ఆరోజు తీరిక లేకపోయిందా?" అంది నిష్టూరంగా. నాకు తెలుసు ఆంటికి కోపంవస్తుందని

కొడుకు డాక్టరు అతని పెళ్ళికోసం తొందరపడుతోంది. పుట్టినరోజుసాకుతో గొప్పవాళ్ళందర్నీ పార్టీకి పిలిచింది పోయిన ఆదివారం. ఆవిధంగా కొడుక్కి సంబంధం వెతుక్కోవచ్చని. ఫోన్‌చేసి ప్రత్యేకంగా చెప్పినా నేను రాలేదని కోపం

"తీరికలేక కాదు ఆంటీ చాలేక రాలేదు."

"అదేం? అంది.

"నీకు తెలుసుగా" నవ్వాను అదోలా.

"లోపలికిరా" అంది. ఆవిడ వెనకే వెళ్ళాను

"చూడు, ఒంటరి వాడివికావడం నీ నేరంకాదు. నిన్ను తమలో కలుపుకోలేకపోయేవాళ్ళది తప్పు" అంది. ఫ్రిజ్ తలుపు తెరిచి మంచినీళ్లు నా కందిస్తూ.

మంచినీళ్లు తాగాను. ప్రాణంలేచివచ్చినట్టయింది ఆంటీ చేత్తో ఏదిచ్చినా అలాగే ఉంటుంది ఈ ప్రపంచంలో నాకు ఆత్మీయులై ఉన్నారంటే అది సరళ ఆంటీ ఒక్కతే ఆవిడలో తల్లి ప్రేమని చూడగలిగాను.

"బాధపడకు రాలేదన్న బాధతో అన్నాను" అంది నాతలమీద చేయ్యేసి నిమురుతూ

"లేదు ఆంటీ అదినా బలహీనత. విడివిడిగా వంద మందిలో మాట్లాడుగలను కానీ అందరితో కలసి, అందరి ఎదటా ఏ ఒక్కరితోనూ మాట్లాడలేను అందుకే నలుగుర్లోకి రాలేను"

"ఫోం చేసావా?" అడిగింది నాకేసి చూస్తూ

"ఊఁ" అన్నాను.

"నిన్ను చూస్తుంటే అన్నం తిన్నట్టు లేదు ఆదేం అలా ఉన్నావ్ ఒంట్లో బాగో లేదా?" అంటూనే నా నుదుటి పైన చెయ్యివేసి చూసింది. ఆవిడ చేతిని అలాగే పట్టుకున్నాను

"పద అన్నం తిందువుగాని" అంది

"ఒద్దు ఆంటీ ఆకలి లేదు"

"అది అబద్ధమని నాకు తెలుసు ఆకలి మొహం ఒక్క తల్లికే తెలుస్తుంది. నేనూ ఒక బిడ్డకి తల్లినే' పద" అంది

"ఆంటీ ఓ మాట అడిగనా?" ఫోం చేస్తూ అన్నాను.

"అడుగు"




"ఏదైనా మనికిష్టమైనా దాన్ని రోజూ చూస్తుండాలంటే ఏం చెయ్యాలి?"

ఆంటీ ఒక్కసారి నా మొహంలోకి చూసి అంది

"అది మనది కాకపోతే సొంతం చేసుకోవాలి"

"అది మరొకరి సొత్తు అయిపోయినప్పుడు??"

"మనమే పని గట్టుకుని వెళ్ళి చూస్తే సరి"

"అది వాళ్ళకిష్టం లేనప్పుడు?"

"మన ఇష్టాన్ని చంపుకోవాలి"

"అది సాధ్యం కానప్పుడో?"

"ఏవిటీ ప్రశ్నలు - ఎందు కడగుతున్నావ్ ఇవన్నీ?" అంది ఆంటీ

"సమాధానం చెప్పు ఆంటీ"

"వస్తువుని మిగలకుండా నాశనం చేస్తే మనశ్శాంతి దొరుకుతుందీ అంటే ఆ పని చెయ్యాలి"

"నో ఆంటీ అది వీలుకాదు - అది నాశనం కాటానికి వీల్లేదు ఎక్కడవున్నా అది బాగుండటమే కావాలి"

"అప్పుడు ఒకటే మార్గం మనమె దానికి దూరంగా వెళ్ళి అది మనకళ్ళబడకుండా, దాని జోలికి పోకుండా ఉండాలి. అది సాధ్యం కాక పోయినా తప్పదు"

నేను ఆలోచించాను.

"గంగా ఏమిటలా ఉన్నావ్ ఒంట్లో బాగుందా?"

ఆంటీ కంగారుపడింది నా వాలకం చూసి.

"థాంక్స్ ఆంటీ" అన్నాను.

"అయినా ఏమిటిదంతా?" అడిగింది

"త్వరలో తెలుస్తుంది"

"నిన్ను చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతుంది గంగా ఇక లాభం లేదు. నీ బాధ్యత కూడా నీకిష్టం లేకపోయినా నేనే తీసుకుంటాను" అంటున్న సరళ ఆంటీని చూస్తుంటే ఈవిడని తల్లిగా పొందిన మురళి ఎంత అదృష్టవంతుడనిపించింది

"అంత శ్రమ అక్కర్లేదు ఆంటీ. సమయం మించిపోయింది" అన్నాను

"ఏమీ కాదు. సమయం ఎప్పుడూ మించిపోదు. మించకుండా మనం చూసుకోవాలి" అంది.

రాత్రి పొద్దుపోయేవరకూ కూర్చుని లేచి వచ్చేశాను

o o o o

మనసంతా చిరాగ్గాఉంది. ఏపని చేసినా శాంతం అనేది లేకుండా అయింది, ఫలితంగా ఒకచోట స్థిరంగా నించోలేక పోతున్నాను. ఏ పనిమీదా మనసులగ్నం చేయలేపోతున్నాను. అశాంతిగా వుంది పిచ్చి పడుతుందేమోనని భయంగానూ వుంది. మనసులో అసలు ఆలోచనా అనేవి లేకుండా ఖాళీగా బండబారినట్టుగా ఉంది

డైరీ తెరిచి మొదటిపేజీ తిప్పాను

గత కొన్నిరోజులగా జరిగిన సంఘటనలూ కలిగిన మార్పులూ తల్చుకుంటే ఎందుకిలా జరిగింది అన్న ప్రశ్న తలెత్తింది.

ఆరోజు నాపైన అకారణంగా చెయ్యి చేసుకున్నది అనురాధ భర్తఅని తెలుసుకున్నాను. ఓ శనివారం మధ్యాహ్నం ఆఫీసు అయిపోయినతర్వాత అనురాధని స్కూటర్ పైన తీసుకువెళుతుండగా చూశాను జరిగినదంతా అనురాధ ప్రోద్బలంపిదే అని మొదట ఊహించక పోయినా ఆతర్వాత ఆఫీసులో అనురాధ ప్రవర్తన దాన్ని బలపరిచింది. ఆ సంఘటనతర్వాత అనురాధ తను ఏదో సాధించినట్టు మరింత గర్వంగా తలెత్తుకు తిరగటం చూశాను ఎప్పుడైనా ఎదురు పడినప్పుడు మరీ పొగరుగా నా జోలికొస్తే ఏం జరుగుతుందో చూశావుగా అన్నట్టు నిర్లక్ష్యంగా ఓ చూపు పారేసి మరీ వెళుతోంది.

ఆ చూపునే భరించలేక పోతున్నాను, అనురాధ మొహంలో నాకు నచ్చనిది అదొక్కటే

పదిరోజులు సెలవుపెట్టి రూంలో కూర్చుని ఆలోచించి ఓ నిర్ణయాని కొచ్చాను ఇంత జరిగిన తర్వాత ఇంకా ఆలోచించడం మంచిది కాదనిపించింది. ధైర్యం చెయ్యాలి తప్పదు. గత నెల రోజులుగా నేన చేస్తున్న ప్రయత్నం ఫలించింది. ఇక నిర్ణయం ఒక్కటే మిగిలింది

రెండురోజులు ప్రయత్నించిన మీదట అనురాధని ఒంటరిగా కలుసుకోగలిగాను రికార్డు రూంలో,

"అనురాధా " పిలిచాను. నా గొంతు నాకే వింతగా ధ్వనించింది

తలెత్తి చూసింది అనురాధ ఆ కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. వాటికి నేను బలై పోక తప్పదనిపించింది ఇంకా ఆలస్యంచేస్తే.

"ఏం. ఇంకా బుద్ధిరాలేదా?" అంది.

నేన సమాధానంచెప్పలేదు, నాచేతిలో వున్న కాగితాన్ని ఆమెకి అందించబోయాను

"ఏమిటిది, ప్రేమలేఖా?" అలా అడగటం ఆమె ఒక్కదానికే చాతనవుతుందనిపించింది. తనకి నాపట్లవున్న ఏహ్యాభావాన్నంతటినీ తన గొంతులో నింపుకొని అడిగింది.

"చూస్తే తెలుస్తుంది". చేతినిముందుకి చూపి అందుకోమని చూపులతోనే అర్థిం

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.



ఔషధ యుక్త-నైసిల్
1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

చాను.

"అనవసరం" ఖచ్చితంగా అంది.

"ప్లీజ్"

అనురాధ కంపరంగా చూసింది.... నా ఉనికినే భరించలేనట్టు చీదరింపుగా చూసి,

"ఛీ" అంది. అంటూనే నాచేతిలోంచి కాగితంమడతని లాక్కుని ముక్కలు ముక్కలుగా చింపి నా కళ్ళముందే డస్ట్‌బిన్‌లో పడేసి విసురుగా బయటికి వెళ్ళిపోయింది.

అయోమయంగా నుంచున్న నాకు కుమార్ రాకతో తెలివివచ్చింది. అను రాధ చర్య నా గుండెని తూట్లు పొడి చింది. ఆమె అలా చేస్తుందనిగానీ చెయ్య గలదనిగానీ నేనూహించలేదు.

"ఏం బ్రదర్ ఒట్లో బాగోలేదా?" కుమార్ అడుగుతున్నాడు.

పినిపించుకునే స్థితిలోను. సమాధానం చెప్పకుడా ఆఫీసునుంచి బయటకు వచ్చి ఆటో ఎక్కి సరాసరి రూంకి చేరుకు న్నాను.

నా అవస్థని ఎవరి చెప్పుకోను?ఏమని చెప్పుకోను? వున్న ఒక్క అవకాశము లేకుండా చేసింది అనరాధ.

అనురాధ ఆఫీసుకి వచ్చి అయిదు రోజులైంది. నాలో ఆరాటం పెరగ సాగింది. ఏదో జరిగింది. ఏం జరిగింది? ఏందుకు రావటం లేదు? ఒకవేళ ఉద్యోగం మానేస్తే? ఉహూ అలా జర గదు. మరైతే ఆఫీసుకి రాక పోడానికి కారణం?

అనాలోచనలు ఒక రూపాన్ని చేరక ముందే ఆరో రోజున ఆఫీసు కొచ్చింది అనురాధ. మనిషి చిక్కి పోయింది మొహం నీరసంగా కళా విహీ నంగా ఉంది ఆ రోజంతా ఆమెని చూస్తూనే గడిపానేను నేను. అనుకున్నది జరగ లంటే ధైర్యం చెయ్యాలి. ఆ ధైర్యం సాయంత్రం ఆఫీసు మూసే సమయానికి వచ్చింది.

అనురాధ సీటు దగ్గరకి నడిచాను ఇంటికి వెళ్ళ బోయే ప్రయత్నంలో ఉంది.

"మీతో మాట్లాడాలి" అన్నాను.

అనురాధ తలెత్తి నాకేసి చూసింది. ఆ కళ్లలో భావాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించి ఆఖరుసారి ఓడిపోయాను

"ఏవిటి?" అంది

"ఒక్క అయిదు నిముషాలు కూర్చోండి" అన్నాను.అనురాధ చుట్టూ చూసింది అప్పటికేఆఫీసలో చాలామంది వెళ్ళి పోయారు.

"వీల్లేదు నేను వెళ్ళాలి" అంది మొండిగా.

"వెళ్ళే ముందు అయిదో నిముషాలు కూర్చోక తప్పదు. నేను చెప్పేది వినకా తప్పదు" అంత ధైర్యం ఎలా వచ్చిందో నాకు తెలీదు

అనురాధ నిస్సహాయంగా చూసింది. ఆమె మొహంలో కొత్తగా భయంచోటు చేసుకుంది,

"భయంలేదు నేనేం చెయ్యను"

అయిష్టంగనే కూర్చుంది అనురాధ

"నేనేదైనా చెయ్యదల్చు కుంటే అటువంటి అవకాశాలు ఆది వరకు చాలా వచ్చాయి" అన్నాను అనురాధ మాట్లాడ లేదు, ఎటో చూస్తూ కూర్చుంది.




"ఇది చూడండి"

జేబులోంచి పాకెట్ డైరీ తీసి మొదటి పేజీ తిప్పి ఆమె కిచ్చాను.

"ఏమిటది?" అందుకుని చూసింది

"ఫోటో"

"ఎవరిది?" తెల్లబోయి చూస్తూ అడిగింది

అచ్చుగుద్దినట్లు మీ పోలికలే వున్నాయని ఆశ్చర్యంగా ఉందికదూ?"

"ఎవరీమే?" మళ్ళీ అడిగింది.

"మా అమ్మ"

"వ్వాట్!?"

"అవును. మీపట్ల ఇష్టాన్ని పెంచుకోవడానికి, మీరు అసహ్యించుకుంటున్నారని తెలిసినా మీ ముహంలోకిఆశగా చూడటానికి కారణం, మీపట్ల నా అభిప్రాయం అర్థమైందనుకొంటాను."

ఆగి ఆమె మొహంలోకి చూశాను మవునంగా ఫోటోకేసి చూస్తూ కూర్చుంది. మొహం పాలిపోయినట్టుగా వుంది. ఆమె మనసులో తుఫాను రేగుతోందని నాకు తెలుసు.

"నాకు ఊహవచ్చే సమయానికి మా అమ్మ ఈ లోకంలోలేదు. ఏక్షణాన మిమ్మల్ని చూశానో మీ మొహంలో మా అమ్మరూపం, నా మనస్సులో అమ్మ గురించిన ఆలోచనలు కదలసాగాయి. అన్నవాళ్ళు లేకుండా పెరిగాను తల్లి ప్రేమ ఎలావుంటుందో తెలీదు రోజూ మిమ్మల్ని చూస్తూ అమ్మని వూహించుకొంటూ ఆనందపడేవాడ్ని కానీ నా ప్రవర్తన ఎటువంటి పరిణామాలకి దారితీస్తుందో బాగా తెలిసింది మిమ్మల్ని చూడకుండా, మీతోమాట్లాడకుండాబతకలేననుకున్నాను. కానీ తప్పదు. మీకు నాపట్ల వున్న అభిప్రాయం తెలిసింది. ఇంతకంటే ముందుకిపోవడానికి మీకు మరో

అవకాశాన్నివ్వను. నేను ఎక్కడవున్నా మీరు సుఖంగా ఉండటమే నాకు కావలసింది. అందుకే నేనీ ఊరు వదిలిపెట్టి వెళుతున్నాను. ఎన్నో ఆనందాలు నాకు దూరమవుతాయి జీవితంలో. అందులో ఇదొకటనుకుంటాను. వస్తాను గుడ్‌బై."

చెప్పదలుచుకున్నది అయిదు నిముషాల్లో ముగించి అక్కడ మరొక్క క్షణం నిలవకుండా బయటికి వచ్చేశాను.

నా వెనక అనురాధ మొహాన్నిచూడ చూడటానికి, ఆమె భావాలు చదవడానికి ఇప్పుడు నాకు అవకాశంలేదు 



### రచయితలకు ఒక ముఖ్య గమనిక

జ్యోతి, భాగ్యలక్ష్మి నవలల పోటీకి పంపే రచనలకి మా ఎడ్రస్ స్పష్టంగా
జ్యోతి మాసపత్రిక, పి.బి. నెం 1824, హైదరాబాదు-20
అని వ్రాయవలసిందిగా కోరుతున్నాము.

# పర్సనల్ కాలమ్

## మల్లాది వెంకటకృష్ణమూర్తి

అక్టోబరు 26.

అక్టోబర్ 22వ తారీకు సాయంత్రం నాలుగున్నరకి నీలంరంగు చీర కట్టుకుని 45 నంబర్ బస్సులో కల్పన టాకీస్ బస్‌స్టాప్ నుంచి రాణీగంజ్ దాకా ప్రయాణం చేసిన యువతి ఈ ప్రకటన చూస్తే, దయచేసి తన చిరునామా తెలుపవలసిందిగా కోరుతున్నాను. అందుకు అయ్యే ఖర్చు నేను భరిస్తాను.

—కళ్యాణ్.

అక్టోబర్ 31.

నా చిరునామా దేనికి...?

—నీలంరంగు చీరమ్మాయి.

నవంబర్ 4.

కనీసం పేరయినా చెప్పండి.

—కె.

నవంబర్ 7.

ఎందుకు ?

—నీ. చీ. అమ్మాయి.

నవంబర్ 11.

ఎందుకో శతమంది చదివే దిన పత్రికలో ప్రకటిస్తే బావుండదని చెప్పటం లేదు. మీరు ఖచ్చితంగా బావున్నారు. తప్పుగా అర్థంచేసుకోకండి.

—కె.

నవంబర్ 20.

ప్లీజ్ మీ చిరునామా లేదా ఫోన్ నంబర్ (వుంటే) చెప్పండి అర్జెంట్. మీకు వివాహం అయిందా?

—కె.

నవంబర్ 26.

లేదు.

—నీలంరంగు చీరమ్మాయి.

నవంబర్ 30.

డిసెంబర్ 6 నా పుట్టినరోజు.

డిసెంబర్ 5.

రేపే నా పుట్టినరోజు. సాయంత్రం సాయంత్రం ఏడునుంచి ఏడున్నర దాకా హోటల్ ఎమరాల్డ్‌లో మీకోసం ఎదురు చూస్తూంటాను. ఈ పూట్కో వంటరిగా బ్రతికే నాకు రేపు రాత్రి కూడా వంటరిగా భోజనం చేయాలనిలేదు. ఎదురుచూస్తూం టాను. టేబిల్‌మీద "వీక్ ఎండ్" అనే

మేగజైన్ వుంటుంది. తెలిక [illegible] గుర్తు వట్టచ్చనన్న.

—కె.

డిసెంబర్ 9.

మీరు రానే లేదు ఈ దినపత్రిక చూడటం లేదా? చెప్పండి.

—కె.

డిసెంబర్ 12.

చూసాను. ముక్కు మొహం తెలియని మీరు పిలవగానే రాత్రిపూట ఎలా వస్తాననుకున్నారు?

—నీలంరంగుచీరమ్మాయి.

డిసెంబర్ 16.

కనీసం మీ పేరయినా చెప్పండి. నేను మీ ఇద్దరి ప్రకటనలు గమనిస్తూనే ఉన్నాను అడగ్గానే పేరుచెప్పడం మర్యాద.

—దేవకి.

డిసెంబర్ 16.

వచ్చే ఆదివారం అంటే 20 తారీకున అక్కడే ఉదయం పదికొండు... ఎదకొండున్నరదాకా మీకోసం ఎదురుచూస్తుంటాను. మీతో మాట్లాడాలి. తప్పక రండి.

—కె.

డిసెంబర్ 20.

మిష్టర్ కల్యాణ్. ఈ పేపరు నేను రెగ్యులర్‌గా చదువుతాను. రెస్టారెంట్‌లో మీ ఇద్దరినీ చూశాను కానీ పలకరించే లోపే ఆటోలో వెళ్ళిపోయారు. ఆ అమ్మాయి పేరు చెప్పవలసిందిగా కోరుతున్నాను.

—రామారావు.

డిసెంబర్ 24.

నే చెప్పను, మీరు అబ్బాయి కాబట్టి. అమ్మాయి అయితే చెప్పేవాడిని. చెప్పవద్దని ఫోన్‌చేసి చెప్పిందా అమ్మాయి.

కె.

డిసెంబర్ 27

నేనడుగుతున్నాను. చెప్పండి. ఆ అమ్మాయి పేరు తెలుసుకోవాలని వుంది నాకు.

—సమీర్. ఎస్.

డిసెంబర్ 31

మీరు అమ్మాయికాబట్టి చెప్పచ్చుకాని రామారావుకి కూడా తెలుస్తుంది. ఆ అమ్మాయి తన పేరుని పేపర్‌లో పబ్లిష్ చేయద్దని మ ప్రకటన చూసాక ఫోన్ చేసి చెప్పింది. మీ ఫోన్ నంబర్ చెప్తే స్వయంగా నాకంఠం వినచ్చుమీరు. దేవకికి మీకు, రామారావుకి, నాకు మాతన నంవత్సర శుభకాంక్షలు

—కె.

జనవరి 4.

మా ఇంట్లో ఫోన్ లేదు మా అన్నయ్య పి అండ్ టి లో పనిచేస్తున్నాడు. ఫోన్ గ్రామ్ బుక్ చేసే నంబర్‌ని రేపు మధ్యాహ్న రెండు, రాత్రి పది మధ్య చేసి చెప్పండి. ఆషిఫ్ట్‌లో వుంటాడు, పేరు మునిస్వామి

—సమీర్.ఎస్

జనవరి 8

ఆ అమ్మాయి నాతో అన్నయ్యకి చెప్పద్దంది. తన పేరు మొగవాళ్ళకి చెప్తానని ఎలా అనుకున్నారు? మా అన్నయ్యే సమీర్ అనే ఆడపేరు పెట్టుకున్నాడని ఆ అమ్మాయి అభిప్రాయ పడుతోంది. సారీ.

—కె.

జనవరి 8

జనవరి 5న దాదాపు రెండు వందల మంది ఫోన్ చేసి కళ్యాణ్ మీకు ఆ



అమ్మాయిపేరు చెప్పొద్దా?అని" అడిగారు ఆడా మొగ అనేక మంది. జనవరి 8 నూటపైభై ఫోన్ కాల్స్ వచ్చాయిట, నేనప్పుడు డ్యూటీలో లేను-నాకు ఎవరూ ఫోన్ చేయకండి.

—మునుస్వామి

జనవరి 11

ప్రస్తుతం మణిపూర్‌లో వున్న నా భార్య పుట్టిన రోజున గ్రీటింగ్ ఫోనో గ్రాం పంపుదామని జనవరిన సాయంత్రం నాలుగు న్నరనుంచి తొమ్మిదిదాక ఫోన్ గ్రామ్ బుక్ చేసే నంబరు ఓ అరవై

అయిదుసార్లు ప్రయత్నించినా దొరకలేదు. అది ఎంగేజ్ అవడానికి కారణం తెలిసింది. పబ్లిక్ ఫోన్‌ని తన వ్యక్తిగతమయిన పనికి నమీర్ లాంటి వాళ్ళు వుపయోగించు కోవటం అన్యాయం అక్రమం. అధర్మం.

—రావులపాటి సుబ్బారావు.

జనవరి 31

నిశ్శబ్దంగా వున్నారే? మీరిద్దరూ తరుచు కలుసు కుంటున్నారా? లేదా? ఏమైంది? చెప్పండి.

—దేవకి.

ఫిబ్రవరి 14

చెప్పండి. ఏమైంది? క్యూరియాసిటీతో చచ్చిపోతున్నాను నేను.

—దేవకి.

ఫిబ్రవరి 28

వాళ్ళిద్దరూ ప్రేమలో పడినట్లున్నాయి. పేపర్ చూసే తీరిక ఎక్కడ ఉంటుంది!

—రామారావు

మార్చి 4

సుబ్బారావుగారూ, కాస్త ఒళ్ళు దగ్గర పెట్టు కోండి. జాగ్రత్త.

—నీలం రంగుచీర అమ్మాయి.

మార్చి 8

కవాడిగూడలోనే మా ఇల్లు. నీలం రంగు చీర కట్టుకునే ఆ అమ్మాయి పేరు సునంద. మాపక్క వీధిలోనే వుంటుంది. పెళ్ళయింది కూడా.

—దమయంతి

మార్చి 13.

నా పేరు సునందేంకాదు. నేను మీ పక్కవీధిలో వుండటంలేదు. ఆ చీర పండక్కి వచ్చివెళ్ళిన మా అక్కయ్యది కట్టుకున్నా నప్పుడు. నాకు నీలంచీర లేదు. ఎప్పుడూ ఇక కొనుక్కోను. నేను అవివాహితను.

—నీలంరంగు చీరమ్మాయి.

మార్చి 17.

కొన్ని లక్షలమంది పాఠకులు సీరియల్ నవలకోసం చూస్తున్నంత ఆసక్తిగా మీ వివరాలకోసం ఎదురుచూస్తున్నాం. మీరు రోజూ, లేదా ప్రతీఆదివారం కలుసుకుంటున్నారా? చెప్పండి.

—జి. అప్పారావు (చిక్కడపల్లి)

మార్చి 21.

జి. అప్పారావుగారి అభిప్రాయంతో మేము ఏకీభవిస్తున్నాం

—కృష్ణారావు అండ్ ఫ్రండ్స్ (మాసాబ్‌టాంక్)

మార్చి 21.

ఈనెల 17న అప్పారావు జి. గారు రాసింది నబబే. మీ వివరాలు తెలియ చేయండి.

—యం. ఎస్ ఆర్ మూర్తి (తుని)

మార్చి 21.

జి. ఏగారు రాసింది నమ జనం. ఈ వార్తా దినపత్రిక మనందరిది మనకి తెలుసుకునే హక్కుంది రోజూ కొంటున్నాముగనక,

—సత్యనారాయణ,
చందానంబర్ 66831/81-82.

మార్చి 21.

నా మనసులోని మాటని అప్పారావుగారే చెప్పేసారు. 17వ తారీకు. వారికి నా కృతజ్ఞతలు.

—శ్రీనివాస్, బి.కాం. (తృతీయ)



**ఎడిటోరియల్**

మార్చి 21.

ఈ రోజు పర్సనల్ కాలంకి డిమాండ్ పెరిగింది. ప్రకటనలన్నీ అంగీకరిస్తే ఎడిటోరియల్ తీసేయాల్సి ఉంటుంది. అంచేత ఈరోజు రాజీవ్‌గాంధీ ఆంధ్రప్రదేశ్ పర్యటనగురించి రాయల్సి వున్నా, పర్సనల్ కాలం మీద రాయాల్సిన ఆవస్యకత ఏర్పడింది,

ఇలా 'పర్సనల్ కాలం' మీద ఎడిటోరియల్ నాకు తెలిసి ఇంతవరకు ఎవరూ రాయలేదు. కళ్యాణ్ అనే అబ్బాయి అయిదునెలల క్రితం ఓ రోజు నీలంచీర కట్టుకున్న ఓ అమ్మాయిని బస్‌లో చూసి ఆ వివరాలు రాస్తూ ఆమె పేరు, చిరునామా అడిగితే ఆ అమ్మాయి చెప్పడానికి నిరాకరించింది. పుట్టినరోజున భోజనానికి పిలువగా ఆమె తిరస్కరించింది. కానీ ఇతరులు కల్పించుకోవడంతో తర్వాత వెళ్ళిందనిచెప్పకతప్పదు. ఆ తర్వాత ఆమె పేరడిగినా, ఏమైందని అడిగినా ఆ ఇద్దరూ పాఠకులకి తృప్తికరమైన సమాధానం ఇవ్వటంలేదు

పాఠకుల తరపున నా తరపున వారిరిరువురికీ ఏం జరుగుతుందో తెలియ చేయవలసిందిగా కోరుతున్నాను. నేనందుకోసం పర్సనల్ కాలంలో ఆరులైన్లదాకా ఛార్జ్ చేయమనికూడా తెలియచేస్తున్నాను.

—ఎడిటర్

**ఉత్తరాలు - లేఖలు**

మార్చి 25.

21న ఎడిటర్ సర్వేశ్వరావుగారి ఎడిటోరియల్ మీ (మా) దినపత్రికకీ హైలైట్.

—కంచిమూతి శోభనరావు, (తెనాలి)

ఈనెల 21 వతారీకు ఎడిటోరియల్‌తో నేను ఏకీభవించాను. మన ప్రజాస్వామ్య ప్రభుత్వంలో ఎవరి బ్రతుకు వారు బ్రతికే హక్కు వున్నప్పుడు వారికి ఇష్టం

లేకుండా అ్రపేమికు లిద్దరినీ తమ గురించి చెప్పమని అడగడం సమంజసం కాదు.

—చిట్టి, విశ్వాస్, రాధ, రేణుక, ఆర్. ఎస్. సంధ్య, సుదర్శన్, (చినమునగాల గ్రామం).

కళ్యాణ్ గారికి,

ఎడిటోరియల్ చదివావుగా? మీరిద్దరు కలసి ఓ లేఖని రాస్తే ఖర్చులేకుండా ఇదేకాలంలో ఎడిటర్‌గారు ప్రచురిస్తారు. ఎడిటర్‌గారూ మిమ్మల్ని అసి వేయమని కోరుతున్నాను. మా వూళ్ళో చాలామంది ఆ లేఖని చదవాలని ఆత్రుత పడుతున్నారు.

—కె. యాదగిరి (మెదక్)

ఆర్యా,

పర్సనల్ కాలంలో గత ఆరు నెలలుగా జరుగుతున్నది శ్రద్ధగా పరిశీలిస్తున్నాను. దేవకి, రామారావు, అప్పారావు, జి. మొదలైనవాళ్ళంతా కేవలంఅచ్చులో తమ పేరు చేసుకోవాలనే తపనతోనే ఆ ప్రకటన లిచ్చారని అభిప్రాయపడుతున్నాను ఇలాంటి ప్రకటనలని అంగీకరించకండి.

—మునగపాకల రామస్వామి, (కర్నూల్)

ఏప్రిల్ 1.

నీలంనీర అమ్మాయి పేరు చెప్పను. మేమిద్దరం ఈనెల అయిదో తారీకు మొజాంజాహి మార్కెట్ సమీంలోనున్న ది రిజిష్ట్రార్ ఆఫ్ మేరేజెస్ కార్యాలయంలో వివాహం చేసుకోబోతున్నాంఅని చెప్పడానికి నంతోషిస్తున్నాం. అందరూ ఆహ్వానితులే.

ఏప్రిల్ 5.

ఆ నూతన దంపతులకు మా శుభాకాంక్షలు. నేను హైదరాబాదు వాసినైవుంటేతప్పక హాజరయివుండేవాడిని.

—పి. ధనిష్ట, డ్రామా ఆర్టిస్టు (గన్నవరం)

ఉత్తరాల శీర్షిక

ఏప్రిల్ 6.

మీ దినపత్రిక ద్వారా ఓ వివాహం కుదరడం అపూర్వం. కంగ్రాట్యులేషన్స్. వారి ఫోటోలు ప్రచురించవలసిందిగా కోరుతున్నాను.

—వత్సలామణి (హైదరాబాద్)

ఉత్తరాలు

ఏప్రిల్ 9.

నేను ఈనెల అయిదో తారీకున శలవుపెట్టి రిజిష్ట్రార్ ఆఫ్ మేరేజెస్ ఆఫీస్‌కి వెళ్ళాను కాని కళ్యాణ్‌కీ ఆ అమ్మాయికీ వివాహం జరగలేదక్కడ ఎందుకువారు విరమించుకున్నారో అర్థం కాలేదు.

—డి సాయికృష్ణ (సికింద్రాబాద్).

ఇలాంటి ఉత్తరాలు మరో ఎనభై ఏడు వచ్చాయి. ఈరోజు ఎడిటోరియల్ చూడండి. సం॥

ఎడిటోరియల్

....ఈ విషయంలో ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ మరోసారి ఆలోచించి తగు నిర్ణయం తీసుకుంటారని ఆశిస్తున్నాం,

ం ం ం ం

ఏప్రిల్ అయిదో తారీకు కళ్యాణ్, నీలంనీర అమ్మాయి వివాహం కవర్ చేయడానికి మా ప్రత్యేక ప్రతినిధిని

## అహం(భావం)

నా అర్ధాంగి మోము
వెన్నెలలు వెదజల్లు
పున్నమి చందమామ అయితే-
తన్మూల కాంతిరేఖల
భాను బింబము నేను.

నా కులకాంత కాటుక కనులు
చిక్కని తుమ్మెద బారులైతే-
వాని ప్రాదుర్భావ కేంద్రమగు
చిన్ని కనుపాప నేను.
నా నారి కురులు జగతిలో
జడివాన కురియు కారునల్లని
మొయిలైతే-
దాని అంచున తళుక్కని మెరియు
విద్యుత్కాంతి నేను,
నా సుదతి హాసమ్మొక
విదియ చంద్రునిబోలు
వెలుగురేఖ అయితే-
దాని శిరమున దాల్చు
మహేశ్వరుడ నేను.
నా యిల్లాలి నొసట
కుంకుమ రేఖ
అగ్నిశిఖ అయితే-
నేను నిత్యాగ్నిహోత్రుణ్ణి.

ఆర్. ఎల్. నరసింహం

రిజిష్ట్రార్ ఆఫ్ మేరేజెస్ఆఫీస్‌కిపంపాం. వారి వివాహం చేయటానికి కనీసం పాతికమంది వచ్చారు. రానిది వారిద్దరే. కారణం తెలియలేదు. వివాహం చేసుకుంటామని వారి పేరుమీద ముందర రూల్స్ ప్రకారం నోటీసు నెలక్రితం ఇచ్చారని రిజిష్ట్రార్ చెప్పారు. తమ వివాహం గురించి వారిద్దరూ తిరిగి ఆలోచించుకోవడానికి ఈ నెల వ్యవధి అని వారు రాకపోతే వద్దనుకుని వుండవచ్చని రిజిష్ట్రార్ మా ప్రతినిధికి తెల్పారు. కొందరు వారికోసం చిన్న చిన్న బహుమతులు కూడా తీసుకుని రావడం మా ప్రతినిధి గమనించాడు. వారు తీసుకునే నిర్ణయం మంచిదే అని ఆశిద్దాం. వారు వివాహం చేసుకోడానికి ఇంక ఇరవై ఆరు రోజుల వ్యవధి వుంది. —ఎడిటర్.

ఏప్రిల్ 13.

మా వివాహం గురించి తెలియచేసిన తారీకు పాఠకులు మరోసారి గమనిస్తే మేం కావాలని అబద్ధం చెప్పలేదని గుర్తించొచ్చు. ఆరోజు ఏప్రిల్ ఫస్టు కాబట్టి చిన్న తమాషా చేసాం. అంతే. మా వివాహం ఈనెల ఇరవై ఏడు తారీకు రిజిష్ట్రార్ ఆఫీసులో జరగనుంది. దయచేసి బహుమతులు తీసుకురాకండి, అందరూ ఆహ్వానితులే.

....నీలంచీరమ్మాయి, కళ్యాణ్.

ఏప్రిల్ 20'

ఆ ప్రేమికుల సెన్స్ఆఫ్ హ్యూమర్‌ని మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను.

—ఎస్. శేషాద్రి (రిటైర్డ్ జడ్జి)

వార్త

ఏప్రిల్ 27.

రేపు వుదయం వెలువడే పేపర్‌లో కళ్యాణ్, నీలంచీర అమ్మాయిల పెళ్ళి ఫోటో, ఆమె పేరు ప్రకటించబోతున్నాం. ఈ వాళ మధ్యాహ్నం రెండుంపావుకి వారిరువురి వివాహం జరిగింది. సాక్షి సంతకాలు జి. అప్పారావు, దేవకి చేశారు. దాదాపు నలభై మంది ఆ వివాహానికి హాజరయ్యారు.★

# హాస్య బాణం

- జయదేవ్ -

"నాన్ డిటెన్షన్" పద్ధతి వల్ల మనకెంత ఉపయోగ మో తెలుసా!



విద్యార్థులు క్లాసులు ఎటెండయితే చాలు! ఆరో క్లాసు వరకూ హాయిగా పాసయి పోవచ్చు!!



ఏడవ తరగతిలో కామన్ పరీక్ష! ఇక్కడ సామదాన భేద దండోపాయాలు ప్రయోగించి సులభంగా ఎనిమిదవ తరగతికి ప్రమోట్ ఐపోవచ్చు!!



మళ్ళీ ఎనిమిదినుండి పదవతరగతి దాకా విద్యార్థులకు బోల్డంత విశ్రాంతి!!



పదవతరగతి దాకా
పరీక్షహాల్లో కొంచెం
శ్రమ పడాలి! కేత్తులూ
కేటూర్లూ చూపించి
"చూచిరాత" రాస్తే చాలు!
పది నెగ్గినట్టే!!



ఆనక ఇంటరు డిగ్రీ
పోస్టుగ్రాడ్యుయేషను
స్థాయిల్లో కూడా పై
సూత్రాలే బాగా పనికి
వస్తాయి! శుభ్రంగా
పి.జి డిగ్రీ చేతికొస్తుంది



కాబట్టి "నాన్ డిటెన్షన్"
వల్ల ఎంతఉపయోగమో
అర్థమయిందా!!



ఔను! అటు విద్యార్థు
లూ ఇటు ఉపాధ్యా
యులూ పనితప్పింది!!
ప్రారంభదశనుండీ
పుస్తకాలు ప్రమేయం
లేకుండా పి.జి డిగ్రీదాకా
చదువు చల్లగా సాగి
పోతుంది!! మన విద్యా
విధానంలో మనం చాలా
ప్రగతి సాధించామన్నమాట!



# తల్లీ... గోదారీ...!

## పాలకోడేటి సత్యనారాయణరావు

బస్సు కదిలింది- ఇంటి ముఖం పట్టింది. బస్సులోకి చూస్తోంటే ఎన్నో సీట్లు ఖాళీగా కనిపిస్తున్నాయి.

మూర్తి మనసొకసారి బావురు మంది.

అక్కడ-అదిగో. ఆ డ్రైవర్ సీటు పక్కన ఉన్న సీట్లో రాజు కూర్చునే వాడు. ఆ సీటు కోసం ఎంత గొడవ పడ్డాడో- "మాస్టారూ! ఆసీట్లో నేను కూర్చుంటానండీ- అక్కడి నుంచి అన్నీ చూడొచ్చు!" అని అడిగాడు రాజు. సరే నన బోయేంతలో మరో కుర్రాడు ఆసీటు తనకు కావాలన్నాడు. ఆ తర్వాత మరో కడు.... ఒక సీటు కోసం ఎంత పోటీ....! ఆఖరికి తను లాటరీ వేశాడు. రాజుకే వచ్చింది. రాజు సంబరం ఆకాశాన్ని అంటింది ఆనంతోషంలో అంతా అతని ముఖంలో కొట్టొచ్చినట్లు . .

కానీ.... ఏడీ ఆరాజు ఇపుడు? ఆ సీట్లో లేడే?

—ఏమై పోయాడు ?

అతనిలోటు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది కానీ అతను కనపడడేం?

అలాగే- ఇదిగో, ఇక్కడ ఈ డోర్ పక్క సీట్లో మురళి కూర్చునే వాడు. ఇపుడు మురళీ లేడు. ఆసీటూ బావురు మంటూ ఉంది.

అసలు బస్సు బస్సంతా అలాగే ఉంది.

ఎందుకిలా ఇంత బావురు మంటోంది బస్సు??

—ఎందు కింత నిశ్శబ్దంగా ఉందీ ప్రయాణం?

ఇంటి నుంచి వస్తున్న క్షణాల్లో ఎంత సందడి, ఎంత ఉత్సాహం, ఎంతగోల! ఎన్నిపాటలు, ఎన్ని ఆటలు, ఎన్ని మాటలు ...!!

ఏమై పోయాయి అవన్నీ ఈ క్షణంలో!

ఇందరు పిల్లల్లోనూ ఇంత నిస్సత్తువ దేనికి?

ఇందరు పిల్లలోనూ ఇంత నిర్లీపం గూడు కట్టు కొందేం??

-ఆ ఘోరం తల్చుకుంటే....

కళ్ళు నీళ్ళు నింపుకొంటున్నాయి. మనసు ముక్కలై పోతోంది. ఏమీ చేయ లేక పోయిన దౌర్భాగ్యం ఏడిపిస్తోంది.

వద్దు-పగవాడికి సైతం ఇంత శిక్ష వద్దు.

ఎంత సంబరంగా ఉండాల్సిన తిరుగు ప్రయాణం ఇది! ఇలా జీవం కోల్పోయి...

ఎక్కడో ఎపుడో తనే- ఏదో జన్మలో ఏదో పాపం చేసి ఉంటాడు. లేకపోతే- ఇంతటి ఘోరం తన చేతుల మీదగా జరిగి ఉండేది కాదు!

ఎలా జరిగి పోయింది! క్షణాల మీద, కన్ను మూసి కన్ను తెరిచే లోపున.... -అంతా అయి పోయింది.

-ఖచ్చితంగా నెల రోజుల క్రితం ఈ పాపానికి పునాది రాయిని తనే వేశాడు. ఆ రోజు స్టాఫ్ రూంలో కూర్చుని మాట్లాడుతూంటే అన్నాడు తనే-" పిల్లల్ని పిక్నిక్ తీసుకెడితే బాగుంటుంది, వాళ్ళకూ మనకూ ఈ రొటీన్ బోర్ కొట్టేస్తోంది!"

గొప్ప అయిడియాలు వస్తాయండీ మీకు! అంది కుమారి వేళా కోళంగా.

మూర్తిమనసు నొచ్చుకొంది- "అదేం అలా అంటారు?" అడిగాడు.

"కాకపోతే ఏమిటండీ? ఈ కుర్రమేళంతో ఇపుడే ఇక్కడే వేగ లేక పోతున్నాం కదా- ఇంకా అది చాలక, వాళ్ళతో పిక్నిక్- తిరిగి వచ్చేసరికి జీవితం మీద ఆశంతా చచ్చి పోతుంది!"

కుమారి పద్ధతి తప్పనిపించింది. తన పిల్లల్ని పెంచడం చేతకాక పిల్లలే వద్దు అనుకునే తత్వం అది. చక్కగా చెప్పితే ఎందుకు వినరు?

ఇలాటి వాళ్ళకు నచ్చ చెప్పటం కష్టం. తనుచేసి చూపిస్తాడు. -మనసులోనే నిర్ణయం తీసుకొని హెడ్మాస్టర్‌తో మాట్లాడాడు.

ఆయన తన ఆలోచనలకు సరేనన్నాడు. కానీ.... "తీసుకెళ్ళటానికి ఎవరూరారు మూర్తి! ఎవరికీ వాళ్ళు తమకి బాధ్యత వద్దనే వాళ్ళే కానీ- అందుకే నాకు ఈఆలోచన మూడు నాలుగేళ్ళ నుంచీ ఉన్నా అమలులో పెట్ట లేక పోతున్నాను!" అన్నాడు.

"మీరు ఊ అనండి, నేను తీసుకెడతాను! నాతో ఎవరైనా వస్తారేమో నేను స్టాఫ్ రూంలో కనుక్కొంటాను!"

"ఆసంగతి తేల్చుకోండి! మీరొక్కరూ ఇందర్ని కాచు కోవటం కష్టం, మీకు కొంత సాయం ఉంటే. మీరు సిద్ధపడితే అప్పుడు మిగతా విషయాయి ఆలోచించుకోవచ్చు"

ఆలోచించుకోవడానికి ఏముంది? అనుకున్నాడు మూర్తి కానీ.... స్టాఫ్ రూంలో ఏ ఒక్కరు సిద్ధపడలేదు. ఈ బాధ్యత నెత్తిమీద వేసుకోటానికి - ఊహు- తనతో పంచుకోవటానికి!!

ఆఖరికి తనే-తనొక్కడే....

కుమారి నవ్వేసింది." మీకేమండి- మీరు ఒంటరి పక్షులు - ఎక్కడికంటే అక్కడికి ఎలాఅంటేఅలా వెళ్ళిపోగలరు. కానీ మాకూ కాదుగద!" అంది. అనటంలో వ్యంగ్యం ఉంది. కానీ తన మనసులో ఉన్న బాధను లేపే ప్రయత్నమూ ఉంది.

సీతపోయి నాలుగేళ్ళయింది. కేశవొక్కడే మిగిలడు తనకు. వాడూ ఇప్పుడు తనతో స్కూల్లోకి వస్తుంటాడు. ఉదయం లేచిలేవగానే వంటప్రయత్నం చేసుకోవటం, వంటపూర్తయ్యాక ఇద్దరూ

కలసి భోజనం చెయ్యటం. స్కూలుకు చేరటం-సాయంత్రం వరకూ అదే సరిపోతుంది. దీపాలు పెట్టే వేళకు గూటికి చేరుకుని మళ్ళీ వంట. తర్వాత నిద్ర - జీవితంలో ఛార్మ్ లేకపోయినా - ఏదో గా జరిగిపోతున్నాయి !



ఓన్నే కుమారి "ఒంటరి పక్షులు" కనవడినా - ఆ స్వేచ్ఛ వెనుక ఎంత అంటుంది! పైకి స్వేచ్ఛగా ఉంటున్నట్టు గుండెకోత ఉందో ఎలా చెప్పాలి? ఎవ

రికి వాళ్ళు ఊహించుకోవాలి కానీ.... కుమారిలాటి మూర్ఖురాలికి చెప్పినా ఒకటే చెప్పకపోయినా ఒకటే!! అందుకే తను అలాటి ప్రయత్నం చేయడు. సీత జ్ఞాపకాలుంచి తను తప్పించుకోవాలంటే, కేశవుడికి కొంత సంతోషాన్ని కలుగజేయాలంటే-తను పిల్లల్ని పిక్నిక్ కు తీసుకెళ్ళక తప్పదు-నిర్ణయించుకున్నాడు మూర్తి.

హెడ్మాస్టరు కూడా సరే నన్నారు. బాగా ఆలోచించి ఏ ఊరికి వెళ్ళాలో, అక్కడ ఏం పిల్లల్ని ఆకట్టుకునేవి ఉన్నాయో అన్నీ ప్లాను చేశాడు.

తన ఊహాలు విని స్టాఫ్ రూంలో అందరూ తలోరకంగా వ్యాఖ్యానించారు

"రాజమండ్రియా? ఏముందండీ ఆ వూళ్ళో చూసేందుకు?"

కుమారి నవ్వుతూ జవాబిచ్చింది-

"శ్రీకాకుళం ఊరు ఆ చివరినుంచి ఈ చివర వరకూ పెద్ద గోదావరినది ఉంది. అది చాలదూ!"

"అంటే...తీసుకెళ్ళి గోదారిని చూపిస్తారన్నమాట ఇంతకీ" ఇంకోరు వ్యాఖ్యానించారు.

"చూపిస్తే ఏం లాభముండీ, అందులో దింపి తెస్తే వాళ్ళకు కనీసం గోదారి లోతైనా తెలుస్తుంది!!"

వేళాకోళం అది! కానీ పైనఎక్కడో కనపడని ప్రదేశాల్లో మనం ఎక్కలేని ఎత్తుల్లో, మన ఊహలు చేరలేని ప్రదేశాల్లో 'తథస్తు దేవతలు' ఉంటారట! పసిపిల్లలగురించి కూడా ఇలా దారుణమైన వేళాకోళాలు చేయడం.....!

ఇలటివాళ్ళగురించి తను పట్టించుకోడు.

ఇలాటి వాళ్ళకు రాజమండ్రిలో ఉన్న విశేషాల గురించి చెప్పిలాభంలేదు అక్కడ... ఆంధ్రసాహిత్యానికి నాంది పలికిన ప్రాంతమది. ఆంధ్రదేశానికి వెన్నెముకలా ఉన్న గోదావరితల్లి ఉన్న ప్రాంతమది అక్షరమ్ముక్క రాయాలంటే అవసరమైన కాగితాల్నిచ్చే పేపర్ మిలున్న పట్నమది! అదే అంటే-ఏమంటారో శైలి దికాదా- 'కాగితం ఎలా ఉంటుందో చూపేముందు పలకలు ఎలా ఉంటాయో చెప్పండి. దానికోసం ఏ మార్గాపురమో తీసుకెళ్ళండి ఈ కోలమూకను!' అంటారు. ఇలాటిజనాన్ని ఏంచేసి దారి మళ్ళించగలం??

అందర్నీ తలోసారీతల్చుకొని తుర్పు తిరిగి దణ్ణంపెట్టుకోవాలి తప్ప-గత్యంతరంలేదు.

ఎవరేమంటేనేం, ఏమనుకొంటేనేం- పథకానికీ ప్రయాణానికీ హెడ్మాస్టరు గారు పచ్చజెండా ఊపారు.

పని మొదలయింది

ఎవరెవరు వస్తారో ముందువాళ్ళ పేర్లు వేసుకోవటం, డబ్బులు వసూలుచేయటం, తర్వాత స్కూలుతరపు కార్యక్రమానికి ఉన్నతాధికారుల అనుమతి తెచ్చుకోవటం, అవతల ఊళ్ళలో అవసరమైన ఏర్పాట్లు చేసుకోవటం....అన్నీ జరిగిపోయాయి.

బస్సుకూడా మాట్లాడేశారు.

బస్సులు బయలుదేరేటప్పుడు హెడ్మాస్టరు దగ్గరకొచ్చి అన్నారు- "మూర్తి- చాలా కాలంగా ఉన్న కోరిక నాకు ఇది. పదిమంది పిల్లలతో పదివూళ్ళు తిరగా




చదివిన చదువులకు, చేసే ఉద్యోగా కూ ఏ పొంతనాలేని పద్ధతిలో ఎదుగు ారు ఈ ప్రపంచంలో! ఒకరు సైన్సులో ట్టా పుచ్చుకొని కూరలషాపు పెడతారు, ురొకరు యం. ఏ. అయి వీధి పక్కన ళ్ళీకొట్టు పెడతారు, మరొకరు తనలాగ దిగిఎదగని టీచరు ఉద్యోగంలో చేర ారు. చేరిన రోజున టీచరుగానే ఈ ఉద్యోగం ఆఖరిరోజు వరకు ఏమాత్రం దగక టీచరుగానే మిగులుతోంది.

మారే ప్రపంచంలో కూడా మారని దోగాలు కొన్ని అలాగే ఉంటాయి ాబోలు!!

-రాజమండ్రి చేరేవరకు ఆ లోచ లు అలాగే సాగాయి మూర్తికి. ఒక షయంపై నింకడగా ఉండక, ఒక షయాన్ని గురించి ఏదీ తేలక....

ముందే చేసుకొన్న ఏర్పాట్ల ప్రకారం ల్లలను ఓ హైస్కూలులో దింపాడు మూర్తి. క్లాసు ఎంతగోల చేసినా ఇక్కడ మాత్రం అందరూ మంచి క్రమ శిక్షణతోనే ఉన్నారు. ఇదే క్రమశిక్షణ వీరికి జీవితంలోనూ అలవడితే ఇంక కొదవ దేనికీ ఉండదు. కానీ ఈ చిన్న పిల్లలు పెరిగి పెద్దయేలోగా ఎన్ని శక్తులు వీళ్ళ మీద పనిచేసి, వీళ్ళను ఏదిశకు దింపుతాయో, ఏదిశకు తిప్పుతాయో ఊహించుకోవటం ఇపుడు కష్టం.

హైస్కూల్లో పిల్లల్ని దింపి "జాగ్రత్తగా ఉండండి" అని ఒక్కటికి పదిసార్లు హెచ్చరించి మరీ గేటుదాటి వచ్చాడు మూర్తి.

వెళ్ళి-పిల్లల్ని ఎక్కడికి తీసుకెళ్ళాలని నిర్ణయించుకొన్నాడో అక్కడంతా తగిన ఏర్పాట్లు చేసేందుకు మూర్తి కదిలాడు. పేవరు మిల్లులో పబ్లిక్ రిలేషన్ ఆఫీసర్‌తో కలసి, మిల్లులోపలికి వెళ్ళేందుకు పర్మిషను కోరాడు. ఆయన పసి పిల్లల గురించి వినగానే సంతోషంగా అనుమతించి, కూడా ఒకగైడ్‌ను ఏర్పాటు

చేసేందుకు కూడా సిద్ధపడ్డాడు. అలాగే అక్కడే చిన్న కేంద్ర ప్రభుత్వ పరిశోధ నాలయంలో కూడానూ!

అన్నీ అయ్యాయి అనుకుని నిశ్చింతగా గాలి పీల్చుకోగలిగే టైం దొరికింది మూర్తికి.

తిరిగి వచ్చి-గేటులోంచి స్కూల్లోకి వెళ్ళాక -అక్కడ-సరిగ్గా అక్కడే ఉంది ఆదుర్ముహూర్తం ఏదో! ఎక్కడో తెలీని ప్రాంతంలో ఉండే అతీత శక్తులు ఏవో కొన్ని రాజును ఆవహించినట్లనిపించింది. అందుకే అడిగాడు. దగ్గరగా చేరి, అతి నెమ్మదిగా -

"మాస్టారూ! ఈ ఊళ్ళో గోదావరి ఉంది. కదండీ!"

అవునన్నాడు మూర్తి

"గోదావరి పెద్దనది కదండీ!"

మళ్ళీ అవునన్నాడు మూర్తి

"నేనెప్పుడూ గోదారిచూడలేదండీ!"

"ఈసారి చూద్దువుగానిలే!"

"గోదావరికి అవతల పక్క ఉండే ఊళ్ళవాళ్ళు ఎలా వెడతారండి? ఈత కొట్టా?"

నవ్వొచ్చింది మూర్తికి.

"ఈతకొట్టనక్కర్లేదు. లాంచీలు ఉంటాయి!"

"లంచీలా? అంటే?-" చిన్నతనపు ప్రశ్నలు. ఓపిగ్గా జవాబు చెప్పేకొద్ది ప్రశ్నల సంఖ్య పెరుగుతాయే తప్ప తగ్గవు.

"లాంచీలంటే-పడవల్లాటిది! నౌక, ఓడ, పడవ, లాంచీ, దోనె-ఇలా అన్నీ ఒకరకమైనవే!"

"మరి వేర్వేరు పేర్లెందుకుపెట్టారు?"

నిజమే-వేరు పేర్లుఎందుకు? జహంశా దాటాల్సినదాన్ని బట్టి కాబోలు! లేకపోతే దీని సైజుబట్టి కాబోలు!!- ఏం చెప్పాలి. ఆలోచిస్తూ క్షణంగడిపి, ఆ తర్వాత అన్నాడు మూర్తి-" ఆ ప్రశ్నకు సమాధానం నువ్వు చెప్పునాకు!"

రాజు తెల్లపోయి చూసి తర్వాత అన్నాడు- "రవాణా సౌకరాలు అనే పాఠంలో ఉంటుందేమోనండి!"

"అదే చదివి చెప్దువుగాన్లే?" అన్నాడు మూర్తి నవ్వుతూ.

"మాస్టారూ, నాకు లాంచీ ఎక్కాలని ఉందండీ!"

నిజమే, పిల్లలకు లాంచీ చూపిస్తే.... మంచి ఆలోచనే! తనకు తట్టలేదు అనుకున్నాడు మూర్తి.

"సరే, రేపు పొద్దున్నేవెడదాం, గోదావరికి! అందర్నీ సిద్ధంగా ఉండమని చెప్పు!" అన్నాడు మూర్తి.

రాజు హుషారుగా వెళ్ళిపోయాడు.

మర్నాడు లాంచీల రేవుకు చేరుకున్నారు కాంట్రాక్ట్ బస్సులో. లాంచీలరేవు ఆరోజు కొంచెం రష్‌గానే ఉంది. రైల్ కం రోడ్ బ్రిడ్జ్ వేశాక లాంచీల రేవు వెలవెలబోతోంది. అందరూ క్షణాలమీద అవతల వైపుకు బస్సుల్లో చేరగలిగే టప్పుడు గంటసేపుపట్టే ఈ లాంచీని ఎవరు ఎక్కుతారు?

అయినా పిల్లలందర్నీ లైనులోనుంచో బెట్టి లాంచీకి టిక్కెట్లుకొని ఒక్కొక్కర్ని లాంచీలోకి ఎక్కించాడు మూర్తి.

లాంచీలో బయటవాళ్ళు ఎక్కారు.

లాంచీ కదిలింది.

నీటిని నెమ్మదిగా వెనక్కు తోసు




కొంటూ లాంచీ ముందుకు పోతోంది.

గోదావరి నిండుగా నెమ్మదిగా ప్రవహిస్తోంది. ఎంత చల్లని తల్లి! రాష్ట్రంలో ఈ తల్లి చలవ వల్లే ఎండి గింజలకయినా కొంత లోటు తగ్గుతోంది. ఇటు ఈ గోదావరి తల్లి, అటు కృష్ణమ్మ తల్లి లేకుంటే....-మూర్తి ఆలోచనలన్నీ రకరకాలుగా ఉన్నా .

ఇంతలో ఏం జరిగిందో ఏమో-తెలీదుగానీ- ఉన్నట్టుండి లాంచీ లోంచి కేకలు వినిపించాయి. ఎవరో దెబ్బలాడుకోవటమో ఏమో మూర్తికి అర్థంకాలేదు. కొంచెం దృష్టి అటు వైపు మళ్ళించేలోగానే-లాంచీపైనుంచి ఎవరో ఉన్నట్టుండి నీళ్ళలోకి దూకారు.

"లాంచీ మునిగి పోతోంది రోయ్!" -ఎవరో కేకేసారు.

వెంటనే పెద్ద పెట్టున గోల, కేకలు-

లాంచీ అంతా ఒక పక్కకు ఒరిగి పోతున్నట్లుంది.

-ఆదెబ్బతో అందరూ రెండో పక్కకు పరిగెట్టారు.

ఈసారి లాంచీ రెండో వైపుకు తిరిగింది.

కేకలు, గోల, గగ్గోలు-పెడబొబ్బలు.

ఆ కేకలన్నిటినీ కంట్రోలు చేసే దుకన్నట్లుగా లాంచీ ఒక్కసారిగా తిరగబడింది.

—గోదారి క్షణం కిందటి వరకు నెమ్మదిగా ఉన్న తల్లి-ఇప్పుడు అలలాగా ఆత్రతగా లాంచీలోకి దూసుకొచ్చేసింది.

ఏం జరిగిందని ఆలోచించే లోపునే...

—అంతా జరిగి పోయింది!!!

తల మునకలుగా నీళ్ళు - ఊపిరి పీల్చుకోవటానికి వీల్లేనంతగా నీళ్లు ఉక్కిరి బిక్కిరి చేస్తుండగా-మూర్తికి ఉన్నట్లుండి పిల్లల సంగతి గుర్తొచ్చింది.

గుండెలవిసి పోయాయి అతనికి.

—ఏమైపోయారు వాళ్ళంతా?

ఒక్కసారి తెలివి తెచ్చుకొని. అటూ

ఇటూ చూశాడు

కేకలతో, పరుగులతో- బతకాలనే తాపత్రయంతో, బయట పడాలనే ఆకాంక్షతో- ఒడ్డుచేరాలనే తొందరతో- జీవితంమీద ఆశ అందరిలోనూ కనిపిస్తోంది.

ఎవరి చేతనయినట్లు వాళ్లు తమ తమ ప్రయత్నాలు చేసుకొంటున్నారు.

—మూర్తి ఒక్కసారి నీళ్లలోకి మునిగి మళ్ళీ లేచాడు కొండంత ఆశతో పైకి చెప్పలేనంత నమ్మకంతో కనబడని దేవుళ్ళ మీద నమ్మకంతో, కనిపించే పసిపాపల మీద నమ్మకంతో చేతికి అందిన వాళ్ళను చేతికి అందినట్లుగా ఒడ్డున పడెయ్యాలనే ఆకాంక్షతో

ఒకరు-ఇద్దరూ పిల్లల్ని పట్టుకొన్నాడు. మూర్తి వాళ్ళకు దొరక్కుండా వాళ్లు చేతిలోంచి జారిపోకుండా లక్కొచ్చి ఒడ్డునపడేశాడు

మొదటిసారి ఒడ్డుకు చేరిన మూర్తి ఒక్కసారి గోదావరికేసిచూశాడు. క్షణం క్రితం తల్లిలా లాలిస్తోందనుకొన్న నది ఈ క్షణంలో కోపంతో బుసలుకొడుతునట్లుంది. కోరలు చూపి అలలుపైకెత్తి అందినవార్ని అందుకోవాలనే ఆశగా ఉన్నట్టుంది. నది నీళ్ళల్లోంచి పైకి లేస్తున్న చేతులు, కొట్టుకొంటున్న పిల్లలు

మూర్తి మళ్ళీ నీళ్ళలోకి దూకాడు. బస్సు ఆగింది ఎందుకో మూర్తి ఆలోచనలూ తెగిపోయాయి. ఉన్నట్టుండి గతంలోంచి వర్తమానంలోకి వచ్చాడు.

బస్సు డ్రైవరు కిందకుదిగి ఎవర్నో ఏదో అంటున్నాడు. తొంగిచూస్తే బండి ఏదో అడ్డొచ్చినట్లుగా ఉంది వాడితో కాబోలు ఈ తగవు!!

తగవుఅంటే భయంవేసింది మూర్తికి

ఇంటికి తిరిగి వెళ్ళాక-అసలు అప్పుడుంటుంది కథ! మొత్తం వద్దాలుగు మంది లెక్క తేలకుండా పోయారు కొందరు బతికినా నీరసంతో చావును అనుభవిస్తూ ఉన్నారు-తను ?

తన సంగతి చెప్పనే అక్కర్లేదు.

అనుకోకుండా తలకెత్తుకొన్న వ్యవహారం ఎదురు తిరిగింది

కుముద ఏమంటుంది?- 'ఇందుకే మేం వద్దన్నాం-వినావు కాద!' అంటుంది కాబోలు!!

కాకపోతే ఇంతక్రితమే అన్నట్లుగా "చూసేవేలా భమని, ఏకంగా గోదారిలో ముంచి మరీ వచ్చారుకదా!" అంటుందేమో!

ఏమన్నా- జరగాల్సినది తన చేతుల మీదుగా జరిగింది ఇప్పటికే ఈ వార్త అంచెలంచలుగా ఊరు చేరిఉంటుంది. బట్టకి బట్టకట్టిన వాళ్ళను వాళ్ళ వాళ్ళకు అప్పజెప్పితే-ఆ తర్వాత ఇంకేమైనా మిగిలితే, దాన్ని గురించి ఆలోచించవచ్చు.

కానీ-

ఆలోచించేందుకు ఏమైనా మిగులుతోందా?

మెదడంతా-రేపటిజీవితంలా, ఇన్నాళ్ల ఒంటరి బతుకులా-శూన్యంగాఉంది.

ఎవరికి ఏంచెప్పాలో ఎలాచెప్పాలో కూడా అర్థంకాని స్థితిలో

స్వగ్రామం చేరింది బస్సు

స్కూలు దగ్గరికి అప్పటికే కొందరు చేరారు అంటే ఈ వార్త అప్పటికే చేరిందన్నమాట ఈ ఊరు!!

ఖాళీ బస్సులోంచి ఒకరొకరుగా దిగారు పిల్లలు. ఒక్కొక్కరు దిగుతోంటే

ఆ తల్లిదండ్రుల ఆనందం చెప్పలేనంతగా ముఖంమీద కనిపిస్తోంది. 'అదృష్టవంతులం!' అనే భావన వాళ్ళలోంచి దర్శనం ఇస్తోంది.

"మాబాబు ఏడండీ!–" "మాపిల్లాడు రాలేదేం?" "శివంరాలేదా?"– "మిగిలిన వాళ్ళు ఏరండీ?–" రకరకాల ప్రశ్నలు మొదలయ్యాయి.

ఒక్కసారి అందర్నీ ఎదుర్కోవటం కష్టం-విషయం విన్న హెడ్మాస్టరు వచ్చి ముందు మూర్తిని వెళ్ళిపోమన్నారు. "ఇక్కడ ఉంటే నీకు చాలా కష్టం! ఎవరెలా ప్రవర్తిస్తారో చెప్పటం కష్టం! ముందు నువ్వు వెళ్ళిపో మూర్తీ!" అన్నారాయన.

"వెళ్ళిపోతే.......!" అనిపించింది మూర్తికి క్షణం కానీ....తనవల్లజరిగిన పొరబాటుకాదని. ప్రమాదం - ప్రమాద వశాత్తూ జరిగింది. తను ఏ రకంగా బాధ్యుడు! అందుకే వెళ్ళనని చెప్తూ ఉండి పోయాడు.

"ఇంకా కొందరు దొరికే అవకాశాలు ఉన్నాయండీ! ఆ కంగారులో కొందరు తప్పిపోయి ఉంటారు. మరి కొందరు ఇంకొరితో వెళ్ళిపోయి ఉంటారు!...."

"మరికొందరు చచ్చిపోయిఉంటారు! కదండీ" అన్నారెవరో- మూర్తికి భయం వేసింది ఆ కంఠస్వరానికి.

అటు తిరిగాడు-పట్టాభి అంటున్నాడు ఆ మాట! పట్టాభి ఇద్దరు కొడుకులూ తనతో వచ్చారు కానీ తిరిగి వచ్చేటప్పుడు తాను కనీసం ఒకడినైనా-వెనక్కు తేలేకపోయాడు. ఎంత ప్రయత్నించాడు తాను, కానీ....

ఎవరూ సాయం చేయలేకపోయారు పట్టాభి నుదుటిమీద గీతల్ని వంకర

తీసేందుకు! తన ప్రయత్నాలు విఫల మైనాయి.

"అదికాదండీ!...." నచ్చ చెప్ప బోయాడు మూర్తి.

"నచ్చచెప్పటం దేనికండీ! సరిగ్గా చెప్పండి. మా బాబులు ఇద్దరూ - ఇద్దరికిద్దరూ గోదారిపాలయిపోయారా?"

—సూటిగా ప్రశ్న.

మూర్తికి భయం వేసింది అంత సూటిగా అతను వేసిన ప్రశ్నకు జవాబు చెప్పాలంటే!

కానీ....

నేను....నా చేతనైనంత ప్రయత్నించానండీ!..." మాటలు పేర్చుకొంటూ అన్నాడు మూర్తి.

బాగా చెప్పారు! మీచేతనైనంత ప్రయత్నించి, మీపిల్లాడిని రక్షించుకోగలిగారు!"

మూర్తి మనసొకసారి వణికింది.

అంతే....!-?

అబ్బె, అది కాదండీ....!"

ఛ. వట్టాభిగారూ, మీరు పొరపడుతున్నారు!-" కలిపించుకొంటూ అన్నాడు హెడ్మాస్టర్‌గారు.

పొరబడటం కాదండీ, అది జీవిత సహజం! ఏ ప్రాణికైన ముందు తన వారిని రక్షించుకోవాలనే తపన ఉండితీరుతుంది! మూర్తికీనూ అంతే!" వట్టాభి అన్నాడు కఠినంగా తీవ్రంగా. ఆకంఠంలో బాధ ఉంది. అది అపుకొన్నా ఆగటం లేదు అందుకే స్పష్టంగా మాటలలోంచి కూడా ఆ బాధ బయటపడుతోంది

మూర్తికి జరిగిన సంగతి గుర్తొచ్చింది -ఎక్కడ ఉంది ఆ ప్రయత్నం తన చేతల్లో! పొరపాటునైనా తను తనవాళ్ళనే రక్షించుకోవాలనుకోలేదే! ఎవరు చేతికి అందితే వారిని లాగి బయట పడేశాడే తప్ప....

బయట పడ్డవారిలో తనకేశవుడు ఉండటం యాదృచ్ఛికం!!

—ఎవరికి చెప్పాలి ఆసంగతి! ఎలా చెప్తే నమ్ముతారు అవిషయం!

నిజాన్ని చెప్తే, నమ్మక పోతే....నిజానికి నిజాన్ని నమ్మక పోవటం కన్నా నిజానికి లోకం చెయ్యగలిగే అవమానం లేదు.

ఒక్కసారి నిజం కూడా తనను తాను రక్షించుకోలేక పోతుంది కాబోలు! నిలకడ మీద తేలాల్సిన నిజం క్షణాల మీద ఎలా తేలుతుంది?

కానీ- ఈనిజం ఇలా నిజంగా చలామణీ అయ్యే అవకాశం లేకుండానే పోతుంది కాబోలు!!

-మూర్తికి తల కొట్టేసినట్లు ఉంది.

బాధ. గుండెల్లో రంపపు కోత. ఎక్కడెక్కడో మూల మూల నుంచి నిస్సహాయత చేతకానితనం.

తలవంచుకుని వచ్చేశాడు మూర్తి.

ఏం చేస్తే నమ్ముతారు ఈ నిజాన్ని!

ఏం చేస్తే తాను చేసింది సరైందని ఒప్పుకొంటారు??

ఇంటికి వచ్చి, ఆలోచనతో తల మునకలై....

ఆఖరికి....

"కేశవా!" అని కేకేసాడు మూర్తి.

కేశవు వచ్చి ఉన్నాడు చెప్పండి" అంటు

మూర్తి ఓ కాగితంమీద నాలుగు వాక్యాలు బరబరా రాసి ఇచ్చాడు. ఇది తీసుకెళ్ళి వట్టాభిగారింట్లో ఇయ్యి!" అన్నాడు.

కేశవుడు సరేనంటూ కదిలాడు.




అక్కడ.... కేశవుడు ఆ ఉత్తరం పట్టాభి ఇంట్లో ఇస్తాడు. పట్టాభి ఆ ఉత్తరం విప్పుతాడు. అందులో– 'మీరు నన్ను నమ్మలేదు. నేను ఏ ఆలోచన లేకుండా చేసినపనికి దురాలోచనను, స్వార్థాన్ని అంటగట్టారు. ఆ క్షణంలో నాకు చేతికి అందిన వాడినే బయటకు తెచ్చాను. కానీ ఎంచి కాదు, మావాడనీ వెతికీ కాదు! ఆ క్షణాలు అలాటివి. నా వరాయి అనే ఆలోచననే రానివ్వవు. పోనీండి, మీరెలాగు నా మాట నమ్మక పోవచ్చు. కానీ మీరు ఇద్దరు పిల్లల్ని పోగొట్టుకొన్నారు. కాదనను నావల్లనే జరిగిందనుకొన్నారు మీరు. అదీ తప్ప నను. కానీ ఆదుకొనే క్షణాల్లో, ఆదుకో వాల్సినక్షణాల్లో మానవత్వం ఎలా స్వపర భేదాల్ని మర్చిపోతుందో మీకు అనుభవం లోకి తెస్తాను! మీకు మీ పిల్లల్ని ఎలాగైనా తెచ్చి ఇవ్వలేను. ఇకపై బతికినంత కాలమూ ఈ నింద మోస్తూ బతకలేను. అందుకే ఈ రెండు సమస్యలకూ ఒకే పరిష్కారంగా– నా కేశవుడిని మీకు అప్పగించి వెడుతున్నాను. నేనూ గోదావరి లోనే మునిగా ననుకోండి....'' అని ఉంటుంది ఆ ఉత్తరం చదివిన పట్టాభి నివ్వెరపోయి, తర్వాత తేరుకొని, తన ఇంటికి పరుగున వస్తాడు. కానీ అప్పటికి తాను ఎక్కడ ఉంటాడు?– ఎక్కడో తెలీని ఆ గమ్యానికి చేరటానికి కదా ఈ ప్రయాణం.

అనుకుంటూ మూర్తి లేచి తలుపు గడియ వేశాడు.

తర్వాత శవంలాగ ఇంటి మధ్యకు నడిచాడు.

ఒకసారి ఇంటిదూలంకేసి చూశాడు. కనిపిస్తున్న దూలాన్ని దాటి, ఆపైన ఉన్న కప్పునుదాటి, ఆ కళ్ళు ఏదో గమ్యాన్ని వెతుకుతున్నాయి. అతనికి– క్షణంసేపు గోదావరి తనను ఆహ్వానిస్తూ పిలిచినట్లుగా కనిపించింది. 

సీరియల్

# సౌభాగ్యలత

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవీ రామశాస్త్రి

( జరిగినకథ )

చెల్లెలు ప్రేమతో ఇచ్చిన ఉంగరాన్ని గర్వంతో చిన్నచూపు చూసింది శశి వకుళకి జ్వరం తగిలిన సందర్భంలో శ్రీమంత్ చేసిన సేవ, హనీమూన్ ప్లాన్ వకుళకి జీవితంమీద ధైర్యాన్నిచ్చాయి అక్కడ మహేష్ నిజస్వరూపం తెరజారి నట్టు బయటపడుతోంది ఇంటికి సరిగా రాకపోడం అమ్మాయిలతో స్నేహం, అడిగినందుకు శశికి చీవాట్లు బెదిరింపు షాక్ తగిలినంతయింది అత్తగారు తనని నిర్లక్ష్యంగా చూడడంతోటి

- ఇక చదవండి -

అదేమిటే? లోపలికి రావూ?

లేదక్కా, చెబుతున్నానుగా ఇక్కడే ముప్పావు గంట అయిపోయిందని! శ్రీమంత్ బజారులో నాకోసం ఎదురు చూస్తుంటాడు తను ఆఫీసునుంచి సెలవు అప్లయి చేసి అటే బజారుకు వస్తానన్నాడు నన్ను సరిగా తొమ్మిదిన్నరకు బట్టల షాపులో వుండమంటే ఇక్కడే వది అయిపోయింది

అరరె!" నొచ్చుకుంది శశిరేఖ ఆ నౌకరు దరిద్రుడు నాకిప్పుడే చెప్పాడు నీవు వచ్చినట్టు ఏమనుకోకు!

ఛ, అవేం మాటలు? వెళ్తాను

అలా చిక్కినట్లున్నావేమిటే"

నవ్వింది వకుళ నీ పెండ్లినాటినుండీ జ్వరమే నాకు నిన్ననే తగ్గింది వెళ్తున్నాను

కనుచూపు మేరవరకూ చెల్లెలిని చూచి వెనుదిరిగిన శశిరేఖ, పైన నవ్వులు విని తలెత్తి చూసింది.

తోటికోడండ్రు!

వారి ఐశ్వర్యమంతా శరీరంమీదనే వున్నట్టున్నది అలంకరణ ఒక్కొక్కరిదీ!

వారి నవ్వులు తనగురించేనని గ్రహించిన శశిరేఖ ఉడికిపోయింది.

ఎకాఎకిన మేడమీదకు వెళ్ళింది.

"ఆమె మీ చెల్లెలే నిజంగా? పెండ్లిలో చూసి ఎవరైనా దూరపు బంధువులేమో అనుకున్నాంలే"

తోడికోడళ్ళ గర్వపు మాటలకు సమాధానంకూడా ఈయలేదు శశిరేఖ.

ఆ ప్రక్కనే సోఫాలలో కుషన్స్ సరిజేస్తూన్న నౌకరును చూచి ఉగ్రురాలై పోయింది శశి.

"ఒరేయ్, నాకోసం ఎవరు వచ్చినా వెంటనే వచ్చి చెప్పాలి. మా చెల్లెలు వచ్చిన గంటతర్వాతనట్టా నీవు నాకు చెప్పేది?"

వాడు ఏమాత్రం బెదురు లేకుండా సగర్వంగా నిలబడి చెప్పాడు:

"ఎవరికోసం ఎవరు వచ్చినా ముందు పెద్దమ్మగారికీ, అయ్యగారికీ చెప్పి, వారు చెప్పమంటేనే మీకు చెప్పాలి. పెద్దమ్మగారు ఆ టయానికి పూజలోవున్నారు. అదయ్యేక చెప్పి మీకాడికొచ్చేసరికి ఆలస్యమైపోయింది. నా తప్పేం లేదు." అనేసి నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు.

"నా విషయంలో అదేం పనికిరాదు. వెంటనే వచ్చి చెప్తూండు, తెలిసిందా?"

అని ఒక గావుకేక పెట్టి, కోపంగా తన గదివేపు నడిచిన శశిరేఖనే నఖశిఖ పర్యంతం తీక్షణంగా చూస్తూ కూర్చునివున్నది అత్తగారు శశిరేఖ గదిదగ్గరనే.

ఆమెను సరకుజేయక గదిలోనికి పోబోయిన శశి ముఖం గుమ్మానికి ఢీకొన్నది.

తలుపులకు తాళం!

తాళం చూచినందువల్లనో, తలకు తగిలిన దెబ్బవల్లనో తల తిరిగినట్లే అయ్యింది. తేరుకుని చూచేసరికి గంభీరంగా హేళనగా చూస్తోంది అత్తగారు స్థిరంగా సోఫాలో మరింత సర్దుకు కూర్చుని,

"బయటివాళ్ళెవరూ లోనికి రాకూడదని తాళం వేయించాను. వెళ్ళిపోయిందా ఆ వచ్చిన పిల్ల?"

"పిల్లకాదు. నా చెల్లెలు"

"ఏంపని యిక్కడ?"

"ఏం మీ చెల్లెలెప్పుడూ మీయింటికి రాదా? లేకపోతే మీకు చెల్లెళ్ళే లేరా?"

"ఆపుజెయ్యి," తర్జని చూపి బెదిరింపు స్వరంతో అన్నది పెద్దామె.

"ఈ తలబిరుసు మాటలకు యిక్కడ తావులేదు. చెప్పినట్టు వినడమే!

మరో విషయం-నిన్నగాక మొన్న వచ్చినదానవు-ఈ యింట్లో ఎప్పటినుండో వుంటూన్న నౌకర్లు వాళ్ళు. వాళ్ళమీద ఎప్పుడూ అధికారంగా మాట్లాడకు. నా మాటలనూ నన్నూ నిర్లక్ష్యం చేశావంటే ఈ గదికే కాదు-వీధిగేటుకే తాళం వేస్తాం. తెలుసుకో. నీవు కొత్తదానవు గనుక-తెలియదు గనుక ఈసారికి క్షమిస్తున్నాను"

తాళం తీసి వెళ్ళిపోయింది,

నిప్పు తొక్కిన కోతి చందంగా వున్నది శశిరేఖ పరిస్థితి.

కోతికి గెంతులు వేయడానికి చెట్టుచేమలైనా వుంటాయి; ఆంక్షలు లేకుండా ఇండ్లకప్పులూ, గోడలూ ఎక్కి గంతులు వేయగలదు, చేతికందినవన్నీ కోసి నాశనం చేయగలదు. కానీ తనకు అడుగు తీసి అడుగు వేయడానికీ, అవసరమైన ప్రాణవాయువు పీల్చుకోవటానికీ కూడ ఎన్ని ఆంక్షలో తెలుసుకున్న శశిరేఖ పరిస్థితి వర్ణనాతీతం.

మధ్యాహ్నం రెండుగంటల సమయంలో ఫోన్ మ్రోగడంతో అదరిపడి కూర్చున్న తావునుండి లేచింది శశిరేఖ.

ఏమిటి? ఉదయంనుండీ యింతవరకూ తాను ఇలాగే కూర్చున్నదా?

"ఏం శశీ? బజారుకు వస్తావా? కారు పంపనా?" మహేష్ అడుగుతున్నాడు ఫోన్‌లో.

"ఏంచెప్పాలి?" ఆలోచిస్తోంది శశిరేఖ.

"యూ సిల్లీ గర్ల్. జీవితాన్ని సంతోషంగా గడుపు ఎక్కువ ఆలోచించకు ఓ గంటలో నేనే వస్తాను. గెట్ రెడీ మై డాళింగ్!"

శశిరేఖ సమాధానం వినకనే ఫోన్ పెట్టేశాడు.

ఔను సమాధానం వేరే ఏముంటుంది గనుక ? ముందే అష్టదిగ్బంధనం చేసి వివాహం చేసుకున్నాడు; అతడిమాట వినడంకన్నా శశికి మరో గతి లేదని అతడికి నిశ్చయంగా తెలుసు

"వకుళ అంతా గ్రహించే వుంటుంది. తన అక్కను చూడడానికి తాను నేరుగా లోనికి పోను వీలులేని యింట అక్కస్థితి ఏమిటో బాగా అవగాహన అయ్యేవుంటుంది. ఈసరికి అంతా శ్రీమంత్‌కు చెప్పివుంటుంది కూడా! అతడేమని భావించుతాడు?"

శ్రీమంత్ తలపుతో నిటారుగా అయ్యింది శశి. మందకొడిగా వున్న ఆమె మనసు నెవరో ముల్లుగర్రతో పొడిచినట్లే అయ్యింది. కనీసం శ్రీమంత్ దృష్టిలో ఎగతాళి కాకుండా వుండేందుకైనా తాను ఈ మేడివండు సంసారాన్ని సాగించాలి.

"కాల క్రమాన మహేష్‌లో మార్పు తేవాలి! ఈ చిట పటలు ఎంత కాలం గనుక! వేరే వెళ్ళి పోతే తామిరువురే చిలుకా గోర్వంకల మాదిరి-ఎవరి గోలా లేని ఎత్తైన స్వర్గంలో విహరించుతాం!"

ఒక విధమైన ఆత్మ వంచనతో మనస్సునూ, అభిమానాన్నీ జోకొట్టి, ముస్తా

రెండు దశాబ్దాలకు పైగా తమ రచనలతో పాఠకులను ఉర్రూతలూగిస్తున్న..

ప్రఖ్యాత రచయిత్రి




రచనలు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| చెట్టు-ఛాయ | 6.00 | బృందావనం | 7.50 | ధర్మచక్రం | 12.00 | జనరంజని | 12.00 |
| విశ్వ | 6.00 | దివ్యదీపావళి | 7.50 | చక్రవాకం | 12.00 | ఉత్తేయని-శాపం | 6.00 |
| సత్యం శివం సుందరం | 11.00 | కల్పవృక్షం | 6.00 | కళ్యాణమందిర్ | 7.50 | అనిర్వచనీయం | 6.00 |
| శిలలు-శిల్పాలు | 12.00 | దిక్చక్రం | 6.00 | ప్రేమనగర్ | 10.00 | శోభన్నలు | 6.00 |
| పూజారిణి | 15.00 | చక్రనేమి | 20.00 | చక్రభ్రమణం | 10.00 | సుప్రభాతం | 6.00 |
| సూర్యముఖి | 10.00 | శంఖుతీర్థం | 12.00 | ఋతవిక | 6.00 | ఉషఃస్స | త్వరలో |
| కల్పన | 6.00 | శాంతినికేతన్ | 12.00 | సంసారచక్రం | 7.50 | | |
| నందనవనం | 12.00 | భాగ్యచక్రం | 10.00 | పెళ్లి ఎవరికి! | 6.00 | | |

మీ దగ్గరి బుక్ షాపుల్లో కొనండి - లేదా కావలసిన పుస్తకం ఖరీదులో 1 రూపాయి తగ్గించి M.O. పంపితే - ఆ రూపాయికి V.P. పోస్టులో పంపగలము.




**నవజ్యోతి పబ్లికేషన్స్**

ఏలూరు రోడ్
విజయవాడ-2. ఫోన్: 74005.

టకు ఉపక్రమించింది.

సుడిగాలిలా ప్రవేశించాడు మహేష్

"ఏమిటీ నువ్వు భోజనం చేయలేదా?"

ఆ ప్రశ్నతో ఆప్యాత లేని అధికారమే ధ్వనించేంది."ఎందుకు చేయలేదు?" రెట్టించాడు

"మఱచే పోయాను '' అన్నదీ శశిరేఖ మేజాపై మూత పెట్టబడి వున్న భోజనపు పళ్ళేన్ని చూస్తూ "ఎవరు తెచ్చి ఇక్కడుంచారో నేను చూడనే లేదు." అన్నది తిరిగి

"ఏం అంత పరాకు! ఎందుకంత సెన్సిటివ్‌గా మారావు మాయింటి కొచ్చిన దగ్గర్నుంచీ?" దుస్తులు మార్చుకొంటూ అడిగాడు.

"మా ఇల్లు!''

వ్యంగ్యంగా, ఉపనవ్యంగా విన్పించిందా పదం శశికి.

''ఇక్కడ జరుతున్న వాటికి నిజంగా మతి పోతోంది తెలుసా?" అన్నది కోపంగా.

"ఏమైంది? ఏం జరిగింది?"

"మా పుట్టింటి వారు అడ్డమైన వాళ్ళునట! వారు ఈ గదులలోనికి రానే కూడదని తాళం కూడా పెట్టారు మీ అమ్మగారు! ఇదెవరు సహించగలరు?"

"ఎవరొచ్చారు?"

"వకుళ! దానిని పోర్టికోలోనే నిలబెట్టి మాట్లాడి పంపించాను. గతిమాలిన దానిలాగా!"

నిర్ఘాంతపోయినట్టు చూచిన మహేశ్ అంతలోనే తేరుకున్నాడు!

"చిన్న విషయాలు పెద్దవిగా తీసుకోకు, నేను చెప్తానగా వాళ్ళకు! తెలియక అలా చేసివుంటారు!"

నౌకరును అప్పటికప్పుడు పిలిచి చెప్పాడు "శశికోసం ఎవరైనా ఆడవారు వస్తే అభ్యంతర పెట్టకండి "

"వాడిక్కాదు చెప్పాల్సింది మీ అమ్మకు!" అంటూ ఖన్సున లేచింది శశి! "ఆడవాళ్ళేమిటి- మగవాళ్ళేమిటి- ఎవరైనా వస్తారు. మీ ఎవరి అకాంక్షలూ నాకు అవసరం లేదు".

"అవసరం వుంది! అంతే!" ఖచ్చితంగా పొగరుగా అన్నాడు మహేష్! "పద, టైములేదు. అవతల నాకోసం ఎందరో కాచుకూర్చున్నారు "

బీర్వానుండి డబ్బు కట్టలుతీసి బ్రీఫ్‌కేస్‌లో నింపుకొంటూనే వడివడిగా బయటకు నడిచాడు. "కమాన్" అంటూ, అంతలో మరలా వెనక్కువచ్చి ఏదో జ్ఞప్తికి వచ్చినట్టు శశిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు.

"ఛీ! ఆ చీరతో వస్తావా?"

"దీనికేం? రెండు వేల రూపాయల చీర!" రోషంగా అన్నది.

"అది మా స్టేటస్‌ముందు దిగదుడుపు!" అంటూ బీర్వా తెరచి తన కిష్టమైన చీర తీశాడు.

"అబ్బ. మరీ అంత పెద్ద చీర బజారు కెందుకు?"

"అవసరం గనుకనే-నా ఖరీదైన స్నేహితులంతా వస్తారు."

"బజారుకా? స్నేహితులెందుకు?"

"చూస్తావుగా? ముందు కట్టుకునిరా".

"నాకా రంగు ఇష్టంలేదు."

"దాని రంగూ, ఖరీదూ నాకు చాలా ఇష్టం! అది నాల్గువేలచీర, మహేష్ శ్రీమతి-రాజభూషణంగారి కోడలు కట్టవల్సిన చీర!"

బయటకు నడిచాడు బాణాలువదలి. మార్గాంతరమేమున్నది గనుక? కోరలు పీకిన పాము చందంగా వున్నది శశి స్థితి.

"మనం అందరి ఎదుటా నవ్వుతూ వుండాలి! నూతన దంపతులం! ఆమాడు ముఖం కాస్త మార్చు!" అన్నాడు కారును బజారులో ఒక దుకాణం ముంగిట ఆపుతూ.

ఆ ఊరికల్లా పేరెన్నికగన్న బంగారు వెండి నగల దుకాణంఅది! అప్పటికే వచ్చివున్న కుమార్‌నూ అతడి శ్రీమతినీ, మరో పెద్ద ఉద్యోగినీ అతడి భార్యనూ శశి గుర్తించగలిగింది.

పరస్పరాభివాదాలు అయ్యి అందరూ లోనికి నడిచారు.

"హా! ఈ చీర ఎంతబాగుంది! మీ అందం రెట్టింపు అయ్యింది!" అన్నది శ్రీమతి కుమార్ శశిని, అంతవరకూ అనుభవించుతున్న మానసిక మథన అంతా మాయమై శశి మనస్సు మత్తిల్లింది.

"తనకెంత గుర్తింపు నల్గురిలో!"

"మీ మెడలోని హారంలో ముత్యాలు చాలా విలువైన వనుకుంటాను?"

మరొకామె ఆరాగా అడిగింది.

అందుకు సమాధానం మహేష్ చెప్పాడు.

"ష్యూర్! అది బాంబే నుండి తెచ్చాను. మీకు నచ్చితే తీసుకోండి. మేం మళ్లా చేయించుకుంటాము."

"ఓ! థాంక్స్" అన్నదామె, ఆమె భర్త నవ్వి ఊరుకున్నాడు.

అలా మాట్లాడుతూనే ఆ యిద్దరు స్త్రీలూ అక్కడి ఖరీదైనా నగల సెట్లు పరీక్షించుతున్నారు. ఓవంక ఛలోక్తులు విసురు కుంటూనే పురుషులు కూడా ఆ సెలెక్షన్‌లో పాల్గొంటున్నారు. దుకాణం వారు అతి మర్యాద వినయాలు ఒలికించుతూ ఓపిగ్గా అన్నీ చూపుతున్నారు. శశిరేఖకు ఏమీ అర్థం కావడం లేదు.

నిన్నగాక మొన్ననే కదా అటు అత్తింటి వారూ, ఇటు పుట్టింటివారూ పోటీలు




పడి రకరకాల నగలు యిచ్చారు తనకు వివాహ సందర్భంలో! మరి మఱలా ఈ నగలేమిటి? మహేష్ చాలా డబ్బు తెచ్చివున్నాడు బ్రీఫ్ కేసులో.

మఱలా అతడూ, అతడి స్నేహితులూ కలసి తనకు మరిన్ని నగలు బహుమానంగా యిస్తున్నారనుకుని ఆశపడింది లోలోన. ఆఆశతో అవమానాలన్నీ మఱచి, అతి ఉత్సాహంగా నవ్వుతూ త్రుళ్ళుతూ మాట్లాడ సాగింది మిగిలిన వారితో.

ఒక్క నెక్లెస్, రెండేసి జతల గాజులూ తీశారు ఆ ఇద్దరు స్త్రీలూ, ఆ ఖరీదు మొత్తం యాభై ఆరువేలూ మహేష్ చెల్లించాడు బిల్లు తనపేరున తీసుకుంటూ,

కొన్ని నగలను అప్పటికప్పుడే ధరించుతూ, ''బట్టల కొట్టుకు వెళ్దాం'' అన్నది మిసెస్ కుమార్.

"మీరు మెచ్చే బట్టలు, మీరు ఊహించినంత గొప్పవి— రేపు ఉదయం పది గంటలకు మీ బంగళాను జేరుతాయి. ఇప్పుడు మాత్రం హోటల్‌కు వెళ్దాం, టేబుల్ మన కోసం నిన్ననే రిజర్వ్ చేయించాను." అని అతి వినయంగా కొద్దిగా వంగి అనునయంగా మనవి చేశాడు మహేష్ ఆమెకు.

ఆమె వదనం విప్పారింది; మహేష్ ప్రతిపాదనను ఆమోదించింది ఆహ్లాదంగా.

"ఈరోజు స్పెషల్ డ్యాన్సు ప్రోగ్రాం వున్నది. హోటల్ ప్రొప్రైటర్ మా మిత్రుడేలెండి!" అన్నాడు మహేష్. కుమార్ నవ్వుతూ మహేష్ జబ్బ చరిచాడు.

''కుబేరుడవు! నీ మిత్రులు కాని వారెవరులే మహానుభావా ఈ రాష్ట్రంలో !"

మహేష్ గర్వంగా టై సర్దుకుంటూ శశిశేఖ వైపు చూశాడు.

ఆమె మాత్రం అంతా అయోమయంగా చూస్తూ వింటోంది.

"పాపం మీ శశికి అంతా క్రొత్త, ఏమీ మాట్లాడటంలేదు!" అని నవ్వింది రెండవ స్త్రీ

మహేష్ పనీ రాని నవ్వు నవ్వి ఒక్కసారి తీక్షణంగా చూచాడు భార్యను. అటు తిరిగి ఆమెతో అన్నాడు! "అదేంలేదు రోహిణిగారూ! మా శశి చాలా ఫార్వర్డ్! పెండ్లి ఇప్పుడైంది కానీ, మేం ఏనాటి నుండో భార్యాభర్తలం! ఎటొచ్చీ-మీరేమో అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ గారి భార్య! ఆమగారేమో ప్రాజెక్టు ఇన్‌ఛార్జ్ గారి భార్య! అంచేత మీ హోదాలకు కాస్త జంకుతోంది శశి అంతే!"

రోహిణీ, శ్రీమతి కుమార్ పడిపడి నవ్వారు. లజ్జా హీనంగా పురుషులు శృతి కలిపారు.

"అబ్బ! అంత చాకచక్యంగా-ధైర్యంగా మహేష్‌ను స్వంతం చేసుకున్నారంటే అఖండులేనే శశిగారూ మీరు! తప్పక మీ స్నేహం చేయాల్సిందే!" అన్నది రోహిణి చంచలంగా కనలను త్రిప్పుతూ.

"రేపు మధ్యాహ్నం శశిని మాయింటికి పంపండి. సాయంత్రంవరకూ అక్కడ మేము అందరం సరదాగా గడుపుతాం" అన్నది కుమార్ భార్య.

"ష్యూర్ ష్యూర్! అలాగే " అంగీకరించాడు మహేష్, భార్యను నామ మాత్రంగా కూడా సంప్రదించకనే!

తానూ ఒక మనిషని గుర్తింపు లేదు; తన అభీష్టానికీ, వ్యక్తిత్వానికీ విలువ లేదన్న మాట! అడిగే స్త్రీల ధోరణి అలానే వున్నది; అంగీకరించిన తన భర్త ధోరణి అలానే వున్నది!

శశి వదనం జేవురించింది! అంతలో మహేష్ విసరిన వాడిచూపు ఆమెను అదరిపడేట్లు చేసి, ముఖాన లేని నవ్వును పులిమింది, వాళ్ళంతా ఏవేవో విషయాలు మాట్లాడుకుంటున్నారు. శశి అప్రయత్నంగా చూపులు బయటకు సారించి, రోడ్డున పోయే మనుషులనూ వాహనాలనూ చూడసాగింది.

అరె! శ్రీమంత్. వకుళ!

ఎదురుగా వున్న చిన్న షాపునుండి నవ్వుకుంటూ, ఏదో అతి ఉత్సాహంగా మాట్లాడుకుంటూ వస్తున్నారు. వకుళ చేతిలో చిన్న పాకెట్టు వుంది.

అందులోని చీరను భార్యాభర్తలు మఱలా మఱలా తీసి చూచుకుంటున్నారు.

వకుళ కనులలో ఆనందం, అపూర్వ కళా నృత్యం చేస్తున్నాయి.

"ఇది నాకు చాలా బాగుంటుంది!" అని శ్రీమంత్ అంటూన్నట్లుగా అతడి పెదవుల-చేతుల కదలికలు చెప్తున్నాయి ఎదుటి దుకాణంలో నుండి గమనించుతూన్న శశిరేఖకు.

దారి ప్రక్కన ఆగి వున్న త్రోపుడు బండి దగ్గఱ రెండు ఐస్‌క్రీం కప్పులు కొని ఒకటి వకుళకు యిచ్చి తానొకటి తింటూ యథాలాపంగా చుట్టూ చూస్తూన్న




శ్రీమంత్ ఎదుటి దుకాణం ప్రక్క ఆగి వున్న కార్లనూ జీపులనూ చూచి సాలోచనగా దుకాణంలోనికి పరీక్షగా చూచాడు.

మహేష్ ప్రభృతులు శ్రీమంత్‌ను చూడలేదు, తమ మాటలలో మునిగి వున్నారు. శ్రీమంత్ మాత్రం శశిరేఖతోసహా అందరినీ చూచాడు. శశి ముఖం త్రిప్పుకొంది.

తల పంకించుతూ, చేతిలోని ఐస్ క్రీం పూర్తిగా తినకనే పారవేస్తూ, "పద వకుళా" అని ఆమె భుజం చుట్టూ చేయి వేసి నడిపించుకుంటూ వెళ్ళిపోయాడు.

శశిరేఖకు ఒడలంతా కారం అంటుకొన్నట్లే వున్నది.

శ్రీమంత్ వకుళలు ఎంత నవ్వుతూ త్రుళ్ళుతూ ఆనందంగా వున్నారు! ఆమె భుజంచుట్టూ చేయి వేసి నడిపించుతూన్న శ్రీమంత్‌లో ఎంతటి ప్రేమాప్యాయతలు! వకుళ నవ్వులో లోకంలోని ఆనందమంతా వర్షించుతోంది.

వారు కొనుక్కొని మురిసిపోతూన్న చౌకరకం చీర ఓ అరవై-డెబ్భై రూపాయల ఖరీదు మించదు! వకుళ కట్టిన చీరకూడ ఓ మాదిరిగానే వున్నది.

తాను చుట్టుకొన్న నాల్గువేల ఖరీదుగల చీరవైపు చూసుకొన్న శశికి అది వేయి నాగులను పడుగు పేకలుగా నేసినట్లే కన్పట్టి ఒళ్ళు జలదరించింది.

ఈ క్షణాన తను ధరించిన నగలూ, దుస్తులూ అన్నీ కలసి రెండు లక్షల పైన విలువ చేస్తాయి. ఇటువంటి దుస్తులూ, నగల సెట్లూ ఇంకా వున్నాయి యింటిలో. తాను అక్కడ ఖరీదు చేస్తూన్న నగలు అరలక్షను మించాయి. తన భర్త నిత్యం లక్షలతో ఆడుకొని, లక్షల పైననే నడచే సంపన్నుడు!

అయినా, సాధారణ నెలజీతంపై బ్రతికే మనుషుల ఆనందం, ఉత్సాహం

తనలో లేవు!

"మీ శ్రీమతి ఏవో కలలు కంటూన్నదా మహేష్? సారీ! నవదంపతుల మధ్య మేము అడ్డంగా లేముకదా!"

రోహిణి కంఠం సైరన్‌లా విస్పొస్తోంది. వెనువెంటనే తక్కినవారి నవ్వులు విన్పించగా, ఉలికిపాటుతో తన పరధ్యానానికి సిగ్గిలుతూ చూసింది శశిరేఖ.

"పద మహేష్. త్వరగా భోజనాలు చేసి ఇల్లు జేరితే మీ ఆవిడ పరధ్యానం తగ్గుతుంది" అన్నది సునీత చనువుగా.

"అలా ఏకవచన ప్రయోగాలు చేస్తున్నారేమిటి? వాళ్ళను నగలెందుకు కొన్నావు నువ్వు?"

రోహిణి, శ్రీమతి కుమార్ మరెవరో తెలిసినవారితో హోటల్‌లో మాట్లాడుతూండగా శశి భర్తను నిలదీసినట్లే అడిగింది, తన సందేహాల గురించి.

"వాళ్ళ దయవల్లనే మనకు కంట్రాక్టులు వచ్చి, మనం కోటికి పడగలెత్తుతూన్నది! కోటిలో వేలు ఎన్నోవంతు? ఉడతా భక్తి! అంతే! సరే ఇక మరచిపో తర్వాత వివరంగా చెప్తాలే!" అన్నాడు మహేష్

మహేష్ జీవిత నాణెపు బొమ్మనే యింతవరకూ శశి చూచివున్నది, నేడు ఆమెకు ఆ నాణెపు మరొకవైపు కూడా అర్థం కాసాగింది. అడ్డదారిన వేలకువేలు విసురుతాడు. ముళ్ళసంచులలో లక్షలు మూటగడ్తాడు!

నాట్యం చూస్తూ, తింటూ త్రాగుతున్నారేకానీ కుమార్, మహేష్ శివరాంలు ప్రాజెక్టుకు సంబంధించిన క్రొత్త కాంట్రాక్టు పనికి సంబంధించిన టెండర్స్ విషయమైన చర్చలలో మునిగిపోయారు.

ఎవరైనా తెలిసిన వారు చూస్తున్నారేమోనని జాగ్రత్తగా కాపలాకాస్తూ, మధ్యమధ్యన ఏవో చొప్పదంటు ప్రశ్నలతో శశిని విసిగిస్తున్నారు కుమార్ శివరాంల భార్యలిద్దరూ.

త్రాగిన వాళ్లు సాధారణంగా ఒళ్ళు తెలియని స్థితికి జేరుకుని పడిపోతారనేది శశికి తెలిసిన విషయం. అయితే శివరాంగానీ, కుమార్‌గానీ నాలుక కూడా మొద్దుబారకుండా లక్షణంగా వున్నారు అయిదోగ్లాసు తాగుతూ కూడ! మహేష్ వారిని తలదన్నినంత నిగ్రహ శక్తితో వున్నాడు వారికంటె ఎక్కువ త్రాగుతూకూడ. మటన్, చికెన్ ఆబగా తింటున్నారు సునీతా రోహిణీ!

చర్చలతోపాటు అన్నపాన సేవలుకూడ ముగిశాయి. "ఐస్‌క్రీం తిందాం" అంటూ మరలా బేరర్‌కు ఆర్డరిచ్చింది రోహిణి.

"ఏం అలా కూర్చున్నారు? ఐస్‌క్రీం తీసుకోండి' అంటూ ఓ ప్లేటు శశిరేఖ ముందుకు త్రోసింది కుమార్ భార్య.

"ఏమిటాలోచిస్తున్నారు? ఐస్‌క్రీం తిని చల్లబడిపోతారని భయమా? అక్కర్లేదు ఆ భయం, మా మహేష్ ఘటికుడు!" అని వెకిలి నవ్వు నవ్వసాగింది రోహిణి.




నవ్వలేక నవ్వాడు మహేష్.

శశిరేఖ జుగుప్సతో తల వాల్చుకున్నది. అందరి దృష్టి తనపై కేంద్రీకృతమైనదని ఆమెకు తెలుసు.

"ఊఁ! తీస్కో శశీ!" మహేష్ అన్నాడు.

గత్యంతరం లేక ఐస్‌క్రీం తింటోంది శశిరేఖ! ఆమె ఆలోచనలు ఎక్కడో వున్నాయి.

తానూ శ్రీమంత్ ఎప్పుడూ ఐస్‌క్రీం తెగతినేవారు. నిజానికి అంతగాతినే అలవాటు లేదు శ్రీమంత్‌కు. అయినా తాను ఆఫర్ చేస్తే తృణీకరించేవాడు కాదు. "నీకోసం" అనేవాడు కొంటెగా.

అంత యిష్టమైన వస్తువూ నేడు గరళం లాగా వున్నది శశిరేఖకు, శ్రీమంత్ వకుళ రూపాలు కనులలో మెదురుతూండగా, ఎయిర్ కండిషన్డ్ రూంలో కూడా శరీరం కుతకుత లాడిపోతోంది.

అందరూ తినడం ముగించి లేచారు.

"ఏమిటలా వున్నావ్?" అన్నాడు మహేష్ వెనుకకు మిలిగిపోయిన శశి వద్దకు మరలా తిరిగివచ్చి.

"వాళ్ళు నిన్నంతచనవుగా 'నవ్వు నవ్వు' అంటే నాకు కంపరంగావున్నది!"

"ఏడిశారు!" మహేష్ తేలికగా అనేశాడు. "నా పెంపుడు కుక్క నా మీద కాళ్ళు ఆన్చి, తోక ఊపి విశ్వాసం ప్రకటిస్తుంది. వీళ్ళూ అంతే! చచ్చినట్టు నేను పెట్టమన్నచోట సంతకం పెడతారు, నేను విసిరిన తిండీ, నగలూ చూచుకొని!" బిల్లు

మొత్తం నాలుగు వందల డెబ్భై చెల్లించి, సర్వర్ టిప్ ఇరవై ఇచ్చాడు మహేష్.

"అబ్బ! చాలా అయ్యిందే?" అన్నది శశిరేఖ మహేష్‌తో.

"అటువంటి చౌకబారు మాటలు మాట్లాడకు". కోపం నిగ్రహించుకుంటూ వీలైనంత మెల్లగా భార్యకే వినిపించేట్లు అన్నాడు.

"మనకు పెండ్లిఅయిన సందర్భంలో పార్టీ, బహుమానాలు వాళ్లు మనకు యిచ్చేది అటుంచి, నువ్వు ఎదురివ్వడమేమిటీ వాళ్ళకు?"

"ఔను. నా వివాహ సందర్భంలో నా ఆశ్రితులందరినీ నేను సంతోషపరచు తున్నాను. నాతోడి ఖరీదైన జీవితం యిది— అర్థం చేసుకో. అడుగడుగునా లేకి ప్రశ్నలు వేయకు!"

నడిరోడ్డు మీద అమ్ముతూన్న చౌకరకం ఐస్‌క్రీం కొనుక్కు తింటూన్న శ్రీమంత్ వకుళలు కనులలో మెదిలారు శశిరేఖకు.

తాను తినే వస్తువులు ఖరీదైనవి; కట్టే దుస్తులు విలువైనవి; నిలబడే తావే అపురూపమైనది.

తన భర్త ఒకగంటలో వెదజల్లే డబ్బు శ్రీమంత్ ఎన్నేళ్ళలో సంపాదించ గలడు!

మహేష్ హెచ్చరికతో శశి జాగ్రదవస్థకు వచ్చింది.

"పద! వాళ్ళు నిన్ను రేపు తమ యిళ్ళకు పిలుస్తున్నారు. వస్తున్నాననిచెప్పు"

"వాళ్ళడగడం, నీవు చెప్పడం అయ్యిందిగా? నేనెందుకు?"

"ఊం ఆ పెంకెతనం మాను. నా పద్ధతులనూ, నా మనుషులనూ పరిచయం చేసుకో."

కుమార్ ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడి వచ్చాడు.

"మన హెడ్ క్లర్కు వస్తున్నాడట. ఫోన్ చేశాను. మరి నేను ఆఫీసుకు వెళ్తున్నాను. నీకు మహేష్ సాయం వుండులే సునీతా" అని చెప్పి వెళ్ళిపోయాడు కుమార్ తన జీప్‌లో.

శివరాం దంపతులు సునీతపై ఓ కొంటె నవ్వు విసిరి తమజీప్‌లో వెళ్ళి పోయారు.

"రేపు రావాలి మా యింటికి" అని ఆహ్వానించింది మరోసారి రోహిణి శశి రేఖను.

మహేష్ శశిలతో వారి కారులోనే బయలుదేరింది సునీత.

తమ గేటువద్ద కారు ఆగగానే సునీతా, శశీ దిగారు.

కావలాదారు గేటుతీస్తూండగా శశి అటు నడిచింది. సునీత తిరిగి కారులో కూర్చున్నది.

"నేను వీరిని 'డ్రాప్' చేసి వస్తాను శశీ"అంటూ మహేష్ కారు బయల్దేరదీసి దూసుకుపోయాడు.




శశి కొన్ని క్షణాలు స్థాణువై నిలిచిపోయింది.

“అమ్మా! లోనికి నడవండి” నౌకరు హెచ్చరించాడు గేటుకు తాళం పెడుతూ.

“వెళ్తాగానీ! తాళం ఎందుకూ? ఓ పావుగంటలో వచ్చేస్తారు అయ్యగారు ఇక్కడేవుండు” అన్నది శశి.

“అతడు గుంభనంగా నవ్వాడు”

“ఇక రారు లెండి యిప్పుడు” అని తన పని ముగించి, పోయి మెట్లక్రింద ఖాళీ స్థలంలో వున్న తన మంచంపై పడుకుని ముసుగు పెట్టుకున్నాడు.

నిద్రలో ఏదో మాట్లాడుతున్నాడనుకున్నది కానీ మర్నాటికి అది అందరికీ తెలిసిన భాగోతమేనని గ్రహించింది శశిరేఖ.

ఆమె తెల్లవార్లూ మహేష్ కొరకు నిరీక్షించి ఆశాభంగం పొందింది. మర్నాడు ఉదయం తొమ్మిది గంటల వేళ భారంగా అపుడే నిద్రలేచిన ముఖంతో వచ్చి తూలిపోయి కారుదిగిన మహేష్‌కు సాయంగా నౌకరు వచ్చి మేడ మెట్లు ఎక్కించి మంచం వరకూ తీసుకొచ్చాడు.

“మరి కారు ఎలా నడిపారు? జ్వరంకానీ వచ్చిందా?” అనడిగింది శశిరేఖ.

సమాధానం చెప్పే తెలివిలో లేడు మహేష్.

“ఎవరో డ్రైవరు వచ్చాడు లెండి వెంటనే. జ్వరం కాదు. ఓ రెండు మూడు గంటల తర్వాత లేస్తారు” అని చెప్పి వెళ్ళిపోయాడు నౌకరు!

మహేష్‌కు సమీపంగా వెళ్ళిన శశికి అర్థమైంది సంగతి– అతడివద్ద వస్తున్న వాసనవల్ల.

(సశేషం)

# ఆంతర్యం

## ఇంద్రగంటి జానకీబాల

ఈరోజు నా మనసు ఆనందంతో పరవశించి పోతోంది. నిజానికి కారణం నాకే తెలీదు లోకమంతా అందాల పూల తోటలా కనిపిస్తోంది. ప్రకృతి అందంగా వుంటే మనసు ఆహ్లాదంగా వుంటుందని ఎవరేనా అనుకుంటే అది వట్టి మాటే. మనసు ఒక్కొక్క రోజు ఆనందంగా, ఉల్లాసంగా వుంటుంది. అప్పుడే లోకం అందంగా కనిపిస్తుంది.

ఇంతటి ఆనందం వెనకా నాకొక ఆరాటం లేక పోలేదు. ఈ రోజు నేనేదో గొప్ప విషయాన్ని సాధించ బోతున్నానని పదే పదే అనిపిస్తోంది. అదెలాగా - అని ఆరాటంగా వున్నది.

ఈ రోజే సుధాకర్‌ని కలిసి ఆవిషయం మాట్లాడేయాలి. మనసు లెప్పుడో పెన వేసుకు పోయాయి. ఇంక యీ మాట లెందుకు-అంటే మాట్లాడుకుందుకే అని జవాబు.

నేను పేద పిల్లనే కావచ్చు. అడంబరాలు లేక పోవచ్చు. కానీ, చాలా మంది నన్ను అందగత్తె అనే అంటారు. ఒక్కసారి చూసిన వాళ్ళు మళ్ళీ నావంక చూడకుండా వెళ్ళలేరు. అన్నిటికీ మించి, నా మనసుకి ఎవరూ విలువ కట్టలేరని అంటాడు సుధ, అలాటి మాటలు సుధ నించి వింటుంటే "సుధలొలికే పలుకు" లంటే యివే కాబోలు ననిపిస్తుంది.

అమ్మ కెప్పుడూ నామీద అనుమానమే. నామాటలూ, భావాలు విని అదిరి పోతుంది. ప్రేమకి బీద, గొప్ప లేదంటే నావంక విడ్డూరంగా చూస్తుంది. వదిన మాత్రం మూతి మూడు వంకర్లు తిప్పుతుంది. నేను రేపు సుధాకర్‌ని పెళ్ళి చేసుకుని, కోటీశ్వరుడి భార్యనయినప్పుడు కాని వదినకి తెలిసిరాదు. ఆమె కెప్పుడూ మూడువేల కట్నమిచ్చి మేష్టర్ని చూద్దామా, ఆరువేలదాకా పెట్టి గుమాస్తాని చూద్దామా అనే ఆలోచనలు. అమ్మగాని, వదిన గాని నన్నెప్పుడూ అర్థం చేసుకోరు.

# మౌనం నా మానం

మౌనమె నా మానం
మనసున పండే కాంతుల రాసుల
పరిష్వంగంలో మైమరచటమే
నా ధ్యేయం....
అనుక్షణం నిశ్శబ్ద నిరీక్షణలో
తప్తం అయ్యే భావజలధిలో
ఓలలాడటం నాకిష్టం
ఇష్టాఇష్టాలన్నవి అహంకారపు
ఎక్కిళ్ళంటే అవి నాకే గిట్టవ్
మౌనం చీకటి ఎదలో
బరువుగా సాగే
బెకబెక శబ్దం అయితే
అది భావ అవసానం
మౌనానికి [illegible]
భావ వ్యవసాయం
నవనవోన్మేష శక్తుల సుందర లాస్యం
ఎవరికీ కాదు దాస్యం
కాంతిజల్లుల కనకవర్షం
అందుకే మౌనం నా మానం !!

**డా॥ శిష్ట్లా లక్ష్మీనారాయణ**

సుధాకర్ ఎంత అందంగా ఉంటాడు. ఎంత గొప్ప బట్టలు వేస్తాడు! ఎంత ఠీవిగా నడుస్తాడు! ఎన్ని ఆందాలు వొలికిస్తాడు! ఒక్క చూపులో ఎంతో ఆనందాన్ని పంచి యిస్తాడు. అలాంటి సుధాకర్ నాకోసం ఎంత పరితపిస్తాడో వీళ్ళకి చెప్తే—అమ్మో! ఇంకేమైనా వుందా!

అసలు వాళ్ళ బాబయ్యలు, మామయ్యలు అంతా ఫారిన్‌లో వున్నారు. అందరూ ఎప్పుడూ ఏవో కానుకలు పంపిస్తూనే వుంటారు. అవన్నీ నాకు చూపిస్తాడు. ఇస్తానంటాడు. కాని నేసింట్లో చెప్పుకో లేక, అభిమానంగా తిరస్కరిస్తూ వుంటాను మనసులో తీసుకోవాలని ఎంతలా అనిపిస్తున్నప్పటికీ.

మొన్న నాకు షర్టు వేసుకొచ్చాడు. గుండెలంతా పచ్చని పొదరిల్లు కప్పేసింది. అదేదో చాలా చిత్రంగా వుంది. అచ్చంగా అక్కడ ఒక పొదరిల్లు వున్నట్లే అనిపించింది. అమాంతం ఆ పొదరింట్లోకి పోయి కూర్చుందా మనిపించింది. సుధాకర్ గుండె నాకొక పచ్చని పొదరిల్లే. అయితే నాకున్న ఈ పెంచిన సిగ్గుమొగ్గని తెంపితే ఒక్కసారి ఆపొదరింటి గుండెలో తలదాచుకునే దాన్ని.

నిన్న మాత్రం! ఆ షర్టు ఎంత అందంగా వుందనీ,-గుండెల మీద జలపాతం-తెల్లగా మంచు తుంపర్లు కిందికి దూకుతున్నట్లు-గుండెల్లోంచి ప్రేమామృతం నాకోసం ముందుకు రుకుతున్నట్లు అనిపించింది. చేత్తో చల్లటి ఆ నీటి తుంపర్లని తాకాలనిపించింది.

ఈ రోజు కూడా ఫారిన్ నుంచి వచ్చిన మూడో షర్టు వేసుకొస్తానన్నాడు. ఇదెంత అందంగా వుంటుందో! ఈ రోజు మాత్రం ఒక్క క్షణం శక్తినంతా కూడదీసుకుని సిగ్గునంతా మడిచి పక్కన పెట్టేసి ఆ గుండెలపై తలానిచ్చి, సుధ గుండెల్లో గుడి గంటలు వినాలి-అవును వినాలి- నేడో రేపో పెళ్ళి చేసుకో






బోయే సుధాకర్ దగ్గిర నాకేమిటి బిడియం! ఆనందంతో [illegible] యీ గుండెల్ని అదుపులో పెట్టుకోవాలి. పెళ్ళి మాట కూడా మాట తీసుకోవాలి.

ఎవ్వరూ లేని ఈ పచ్చిక - పరుచుకున్న పచ్చని ప్రేమగా వుంది. ఆకాశానికీ, నేలకీ మధ్య అల్లుకున్న ఈమామిడి చెట్టు గుబురు సుధాకర్‌కీ నాకూ మధ్య సిగ్గు దొంతరలా వుంది. ఎండైనా, వెన్నెలైనా చొరబడని ఈ చెట్టు నీడ, సుధాకర్ అనురాగపు పందిరిలా వుంది.

నా ఆలోచనల్లోంచి తేరుకుంటూ- అదిగో- అతను రానే వచ్చాడు-అంతే, ఒక్కసారి నా గుండె ఝల్లు మంది. భయంతో నా శరీరం వొణికి పోయింది నేను ఒక చిట్టడివిలో చిక్కుకుపోయినట్టు, రక్షించే వాళ్ళెవరూ కనుచూపు మేరలో లేనట్లు అంతా శూన్యంగా అయిపోయింది.

అతని గుండెల మీద పులి అతి భయంకరమైన చిరుతపులి. నోరు తెరిచిన పులి కోరలు స్పష్టంగా కనిపిస్తున్నాయి-నల్లని గుండ్రంలో పసుపు పచ్చని మచ్చలతో పులి-అంత్యత అధునాతనంగా చిత్రించిన పు -ఆతని గుండెల్లోంచి గాండ్రిస్తున్న పులి. ఆ పులి రూపాన్నిదాటి నా కళ్లు పైకి వెళ్ళలేదు. సుధాకర్ కళ్ళతో కలవలేదు. అతని గుండెలో తలదాచుకోవాలనే కోరిక భయంకరంగా అయిపోయింది. నాతలని ఆ పులి నోట్లో పెట్టే ధైర్యం లేకపోయింది. గుడి గంటలకి బదులు పులి గాండ్రింపులు వినిపిస్తున్నాయి. కళ్లు గట్టిగా మూసుకున్నాను. అమ్మ జ్ఞాపకమొచ్చింది. వదిన గుర్తొచ్చింది. ★

మినీ కథ

# ఏది స్వర్గం

జీవితమంతా తీరని కోరికల్తో బాధ పడి బాధపడి ఒక నిరుపేదవాడు, భూలోకంలో కన్నుమూసి పరలోకంలో ఒక విశాల సుందర మందిరంలోని ఒక హంసతూలికా తల్పం మీద కన్ను తెరిచాడు. దగ్గర్లో నిలబడిన సేవకుల్ని పిలిచి -

"ఆకలి" అన్నాడు.

"ఏం తెమ్మంటారు" సేవకుడు అడిగాడు!

భూలోకంలో తను తినాలనుకొన్నవి, తినలేక పోయినవి రకరకాల పదార్థాలు కోరుకొన్నాడు. సేవకుడు క్షణంలో అన్నీ తెచ్చి అమర్చాడు. పేదవాడు క్షణంలో నగంలో తినేసి సుష్టుగా తేన్చాడు. ఆతరవాత హాయిగా పడుకొని నిద్రపోయాడు. సేవకుడు తెచ్చిన షడ్రసోపేత భోజనం మళ్ళీ ఆరగించాడు.

హాయిగా మళ్ళీ తెల్లవారేదాకా నిద్రపోయాడు, భూలోకంలో ఎంత కష్టపడి పనిచేసినా కడుపునిండా తిండి ఎరుగని పేదవాడికి ఈ జీవితం చాలా బావుందనిపించింది. ఇలా కొన్నిరోజులు గడిచాయి. ఒక రోజున -

వాడికి అస్తమానం తినడం, పడుకోవడం, వొళ్ళు విరుచుకొని ఆవులించి మళ్ళీ తినడం, పడుకోవడం విసుగనిపించింది.

సేవకుడ్ని పిలిచి -

"విసుగ్గావుంది ఏదన్నా పనిచెప్పు నేనుకూడా చేస్తాను." అన్నాడు.

"ఇక్కడ చేయడానికి పనిఏమి ఉందండి?" అన్నాడు సేవకుడు.

మానవుడికి కోపం వచ్చింది. "ఏడిసినట్టుంది! ఇలా ఎంతకాలమని ?" అని ప్రశ్నించాడు.

"కొన్ని యుగాలు గడవాలి"

"బాగానే వుంది వ్యవహారం! ఇంతకంటే నరకమే బావుండేట్టుంది, అక్కడికే పోతాను. అన్నాడు మానవుడు, "ఇప్పుడు తమరున్నది నరకంలోనే" అని సమాధానం ఇచ్చాడా సేవకుడు. ★

శ్రీమతి పోలవరపు కామేశ్వరి




## నేటి యువతకు కనువిప్పు "శుభలేఖ"

'సప్తపది' చిత్రంలో కులవ్యవస్థ మీద, 'శుభలేఖ' లో వరకట్నం మీద తను చెప్పదలుచుకున్న విషయాన్ని తిన్నగా, హృద్యంగా, ఆలోచనల్ని రేపే విధంగా చెప్పేడు దర్శకుడు కె. విశ్వనాథ్.

సామాజిక సమస్యలను, సమాజలోని మూఢనమ్మకాలను తీసుకొని శక్తివంతమైన ఈ మీడియా ద్వారా కొంతైనా చెప్పాలనే ఆపత్రయం వున్న దర్శకుడు విశ్వనాథ్. 'శుభలేఖ' లో వివాహవ్యవస్థ మౌలిక సూత్రాన్నే 'వరకట్నం' దెబ్బ తీస్తోందని, ఈ కట్నం పరిధిలో మనిషి ఎలా ఇరుక్కొని పోయాడో, ఎట్లాంటి



'శుభలేఖ' ఇష్టాగోష్ఠి సమావేశంలో ప్రసంగిస్తున్న దర్శకుడు శ్రీ కె విశ్వనాథ్, నిర్మాత శ్రీ వి వి శాస్త్రి, శ్రీ శాయికృష్ణ, శ్రీ కె వి, రాఘవేంద్రరావ్, శ్రీ దశరథ రామయ్య, చిరంజీవి

విపత్కర పరిస్థితిని నేడు యువకులు ఎదుర్కొంటున్నారో ఒక్కసారి యువకుల్ని కళ్ళు తెరిచి వాస్తవాన్ని చూడమని అందంగా హెచ్చరించేడు విశ్వనాథ్. ఇది హర్షించ తగిన ప్రయత్నం.

ఆంధ్రలో లక్ష్మీఫిలిమ్స్, నైజాంలో శ్రీ సాయికృష్ణ వారు 'శుభలేఖ' ను విడుదల చేశారు.

**అభిరుచివున్న పంపిణీదారుడు హరికృష్ణ**

సినిమా నిర్మాణ రంగానికి, ప్రదర్శనా రంగానికి, మధ్య కీలకమైన పాత్ర నిర్వహించేది పంపిణీ రంగం. సినిమా నిర్మించటం కన్నా, పంపిణీ చేయటమే కష్టం ఈ రోజుల్లో.



శ్రీ హరికృష్ణ

ఒక చిత్రాన్ని ఎంత బాగా ఎక్స్ప్లాయిట్ చేస్తే అంత సమర్థవంతమైన పంపిణీ సంస్థగా చెప్పవచ్చు. అందుకు మంచి థియేటర్లు, సక్రమంగా, సకాలంలో థియేటర్లకు ప్రింట్లు అందించటం, తగు ప్రచారం ఇవ్వన్నీ చిత్ర విజయానికి దోహదం చేస్తాయి.

ఎన్నో ఏళ్లుగా పంపిణీ రంగంలో వుండి, అనుభవం, మంచితనం సంపాదించారు లక్ష్మీచిత్ర హరికృష్ణ

పునాదిరాళ్లు, కరుణామయుడు, యువతరం కదిలింది, కార్తీక దీపం, [illegible], మహాప్రస్థానం లాంటి చక్కటి చిత్రాలను పంపిణీ చేశారు.

పంపిణీ రంగంలో చాలా కాలం నుంచి వున్న హరికృష్ణ "మళ్ళీ ఓల్డ్ సిస్టమ్ రావాలి. అప్పుడే పరిశ్రమకు మంచి రోజులు వచ్చినట్టు" అంటారు.

ప్రస్తుతం చిత్రపరిశ్రమ ఎదుర్కొంటున్న సెన్సార్ సమస్యను గురించి ప్రస్తావిస్తూ, "సెన్సార్ నిబంధనలను సక్రమమైన పద్ధతుల్లో అమలుచేసినందు వల్ల అందరికి మంచిదే, కానీ, అలా జరగటంలేదు. ఒక విషయం యిక్కడ చెప్పాలి. జుగుప్సకలిగించే విధంగా చిత్రీకరిస్తే జనమే రాళ్ళతో బుద్ధిచెప్తారు సెన్సార్ వారే చెప్పక్కర్లేదు.

నిర్మాతల యూనిటీ వున్నరోజున సెన్సార్ వారు ఏమీ చెయ్యలేరు" అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చిన హరికృష్ణ శ్రీమతి మాదిరెడ్డి సులోచన రచించిన

'అపురూప' నవలను వచ్చే సంవత్సరం చిత్రంగా రూపొందించబోతున్నారు

### "గోపాల కృష్ణుడు"

కంటితోక పువ్విస్తూ, పెదవితో నవ్విస్తూ అందమైన అమ్మాయిల్ని తన చుట్టూ తిప్పుకొంటూ, ప్రేమపాఠాల్ని బోధించే ఈ అపర కృష్ణుడు ఒక గోపిక చేతిలో చిత్తుగా ఓడిపోయి, ఆమెతో ప్రేమ పాఠాల్ని చెప్పించుకుంటాడు.

ఎవరీ గోపాల కృష్ణుడు? గోపాల కృష్ణుడినే డింకీలు కొట్టించిన ఆ గోపిక ఎలా వుంటుందీ? ఊహించండి?

లాభం లేదు కదూ? అందుకే భీమవరపు బుచ్చిరెడ్డి కోదండ రామిరెడ్డి దర్శకత్వంలో నిర్మించి, లక్ష్మీఫిల్మ్స్ వారు, శ్రీ వెంకట కృష్ణ ఫిల్మ్స్ వారు విడుదల చేస్తున్న 'గోపాల కృష్ణుడు' చూడండి.

### చిన్న నిర్మాతలకు ఎఫ్. డి. సి. రుణ సౌకర్యం

ప్రయోగాత్మక, ప్రయోజనాత్మక చిత్రాల్ని నిర్మించే చిన్న నిర్మాతలకు రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధి సంస్థ రుణ సౌకర్యం కల్పింస్తుందని, ఈ విషయాన్ని ముఖ్యమంత్రి దృష్టికి తీసుకు రావడం జరిగిందని, ఆయన ఆమోదం జరిగాక మిగతా వివరాలు తెలియజేస్తానని ఛైర్మన్ శ్రీ డి. కె. సమరసింహారెడ్డి చెప్పారు.

ఒక్కో చిత్రానికి ఎంత ఇవ్వాలో, ఎలా రాబట్టుకోవాలో కూడా సమగ్రంగా ఆలోచిస్తున్నామని, ఇది చిన్న నిర్మాతలకు ఎంతో ఉత్సాహాన్ని, ఊపును ఇస్తుందని తను భావిస్తున్నానని ఆయన అన్నారు.

తాము అనుకున్న విధంగా రుణ సౌకర్యం కనక అమలులోకి వస్తే, హైదరాబాదులోని చిన్న నిర్మాతలకు చాలా సౌకర్యం వుంటుందని, మంచి చిత్రాలుకూడా రావడానికి అవకాశం వుందని, ఈ విషయంలో గట్టిగా ప్రయత్నిస్తున్నానని సమరసింహారెడ్డి చెప్పారు.

